# భావకవిత్వంలో స్త్రీ

జయప్రభ

చైతన్య - తేజ పబ్లికేషన్స్
A-43; మౌలాలి రైల్వేకాలనీ
హైదరాబాదు - 500 040.

BHAVA KAVITVAMLO STREE

(woman in Telugu Romantic Poetry)

JAYA PRABHA

© 1988; Author

ముఖ చిత్రం :
'తులసి', మొక్కపాటి కృష్ణమూర్తి
(మొక్కపాటి రామకృష్ణకు కృతజ్ఞతలతో)

ముఖ చిత్రాక్షరాలు : శీలా వీర్రాజు

ఫోటో : భరత్ భూషణ్

ముఖ చిత్ర ముద్రణ : జ్యోతి ప్రెస్, హైదరాబాదు.

ముద్రణ : పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు - 500 029.

ప్రతులకు :
చైతన్య తేజ పబ్లికేషన్స్
A-43, మౌలాలి రైల్వేకాలనీ, హైదరాబాదు-500 040.

నవయుగ బుక్ హౌస్
సుల్తాన్‌బజారు, హైదరాబాదు.

విశాలాంధ్ర బుక్ హౌస్
సుల్తాన్‌బజారు, హైదరాబాదు.

వెల : రూ. 26/-

తెలుగు విశ్వవిద్యాలయమువారి ఆర్థిక సహాయముతో ప్రచురింపబడినది.

భావకవిత్వంలో పురుషులకి,

అమలినంగా.

# ముఖచిత్రం

ముఖ చిత్రం ప్రసిద్ధ చిత్రకారులు మొక్కపాటి కృష్ణమూర్తిగారిది (1910-1962). "తులసి" అనే ఈ చిత్రం కృష్ణమూర్తిగారి చిత్రాలలో చాలా ప్రసిద్ధమైనది. అట్టమీద అతికించిన గుడ్డమీద టెంపారా రంగుల్లో మృదువైన వర్ణ సంయోజనంతో చిత్రించిన ఈ చిత్రపు శైలి బహువిధశైలీప్రవీణులైన కృష్ణమూర్తిగారి ప్రత్యేకత. ఆనాటి భావకవిత్వపు స్త్రీకి అపురూపమైన ప్రతి రూపం ఇది.

నేపథ్యంలో తులసిచెట్టుతో, అప్పుడే స్నానం చేసి జారు ముడి వేసుకుని, ముడిలో ఇమడని పాయలు మొహం మీద జారిపడుతూంటే, పసుపుకుంకుమలు పూసిన గుమ్మానికి ఆనుకుని కూర్చుని పుస్తకం చదువుకుంటున్న ఈ ప్రశాంత స్త్రీ మూర్తి అమలినశృంగారమూర్తిగా, ప్రేమమయిగా, అంతరంగశాంతి దేవతగా భావకవిత్వంలో కన్పించే ప్రేయసికి కళాత్మకమైన దృశ్యరూపం.

# భావకవిత్వపు స్త్రీని గురించి

ముందునుంచీ నాకు కవిత్వంలో స్త్రీని పరిశీలించాలని కుతూహలం ఉండేది. ఎమ్. ఫిల్. కోసం ఏ విషయం మీద పరిశోధన చేద్దామా అని తర్జనభర్జన పడుతూండగా, కవిత్వంలో స్త్రీ గురించి చేదామన్న ఆలోచన వచ్చింది. కానీ, కవిత్వంలో స్త్రీ అనేటప్పటికి అది ఎమ్. ఫిల్. పరిధిని దాటిపోయేటంత విస్తృత మైన విషయంగా కన్పించింది. ఇలా ఉండగా నేను ''తెలుగులో కవితా విప్లవాల స్వరూపం'' చదివాను. అందులో భావకవిత్వపు స్త్రీని గురించి వెల్చేరు నారాయణ రావు చేసిన విశ్లేషణ నా ఆలోచనలకు ఒక కొత్తదారి చూపించింది.

అప్పుడు ఎమ్. ఫిల్. కి పరిశోధనాంశంగా భావకవిత్వంలో స్త్రీని తీసుకున్నాను. ఆ తర్వాత చాలా శ్రద్ధతో భావకావ్యాలనీ, భావకవితా యుగంలో వచ్చిన ఎన్నో వ్యాసాలనీ, భావకవిత్వం మీద వచ్చిన విమర్శనీ చదివాను. భావకవిత్వంలో నిజమైన స్త్రీ స్వరూపం ఏమిటో నా అంతట నాకుగా బోధపడటం మొదలయ్యాక అంతదాకా భావకవిత్వంలో స్త్రీ అంటే నాకున్న భ్రమలన్నీ ఒక్కొక్కటి కరిగిపోయాయి.

భావకవిత్వాన్ని ఒక ఆడదానిగా చదివినప్పుడు, నాకు కన్పించిన భా-క కవుల స్త్రీ దృక్పథాన్ని ఈ పుస్తకంలో వివరించేను. ఉదాహరణకి రాయప్రోలు సుబ్బారావు స్నేహలత అనే ఖండకావ్యం వ్రాశారు. వరకట్నం ఇచ్చుకోలేక పెళ్ళికాని పదిహేనేళ్ళ అమ్మాయి ఆత్మహత్య చేసుకుని చనిపోవటం ఇందులోని విషయం. తన పెళ్ళి మూలంగా తండ్రి, ఇతర కుటుంబ సభ్యులు దిక్కులేని వాళ్ళు కావటం ఇష్టంలేక స్నేహలత నిప్పంటించుకుని బలవంతంగా చనిపోతుంది.

ఆ అమ్మాయి అలా మంటల్లో మండిపోతున్న సందర్భాన్ని తీసుకుని ''దహనులో నున్న స్నేహంతామ తల్లి'' అనే మకుటంతో రాయప్రోలు సుబ్బారావు ఓ ఏడు పద్యాలు వ్రాశారు. ఆ పద్యాలలో నిస్సహాయంగా బాధతో కాలిపోతున్న ఆ అమ్మాయి గురించి రాయప్రోలు వారు ఎంత అందంగా రాస్తారో చూడండి.

ఆ అమ్మాయి కవికి,

"చెంగల్వ పువ్వుల చెరువులో కులికే రాయంచ" లాగానూ

"లిఖిత కుంకుమ రంగవల్లికల నడుమ

తీర్చినట్టి కర్పూర వేదిక'' లాగానూ

"పండు పగడాల రాశిలో బడి భ్రమించు

నిండు జాబిల్లి రేకలా నిర్మలము" గానూ కన్పించింది.

ఒక ఆడపిల్ల ఆత్మహత్యని ఇంత "రమ్యంగా" వర్ణించిన కవికి ఆడవాళ్ళ పట్ల ఆదరం గౌరవం ఉన్నాయంటూ సి. నారాయణరెడ్డి వ్రాయటం నాకో సవాలుగా కన్పించింది. తన ఆధునికాంధ్ర కవిత్వంలో సరిగ్గా ఇదే సంఘటన గురించి వ్రాస్తూ నారాయణరెడ్డి పాద పునరుక్తితో, ఎనిమిది రకాల ఉపమానాలతో ఇలా వర్ణించటానికి మార్గము తీసినవారు రాయప్రోలు వారేనంటూ మెచ్చుకుని ఊరుకున్నారు. (ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయాలు, ప్రయోగాలు. పేజీ : 276.)

ఇలా మెచ్చుకున్నవాళ్ళ సంగతటుంచితే, భావకవిత్వాన్నీ అందులోని సమాజాతీత కాల్పనికతనీ విమర్శించిన వాళ్ళు కూడా ఇలాంటి విషయాల మీద ఎలాంటి వ్యాఖ్యానమూ చేయలేదు. వీళ్ళు సహితం భావకవిత్వంలో స్త్రీ చిత్రణ పురుషులకు ఆమోదకరమైన రూపంలోనే జరిగిందన్న సంగతిని గుర్తించలేదు. భావకవిత్వం కూడా పురుషాధిక్య సమాజపు భావజాలం నుంచి పుట్టినదేననీ, ఈ కవిత్వం కూడా ఎంతగా ''ప్రేమగా'' స్త్రీ కోసం రాయబడినప్పటికీ సమాజంలో స్త్రీ స్థితిని మార్చడం పట్ల ఆసక్తి చూపించలేదనీ, అందుకోసం రాయబడలేదనీ వీళ్ళకీ తట్టలేదు. ఎందుకంటే నాకన్నా ముందు భావకవిత్వం మీద పరిశోధన చేసిన విమర్శకులలో ఎక్కువ మంది మగవాళ్ళే. ఒక ఫెమినిస్టుగా నేను నా పరిశోధనలో ఈ మగ విమర్శకులు ఎవరూ పట్టించుకోని అనేక అంశాలనీ, స్త్రీ అంటే భావకవులకు ఉన్న అభిప్రాయాలను కొత్తగా విశ్లేషించాను. భావకవిత్వం మీద పాక్షిక దృక్పథంతో ఇదివరకూ చేసిన విమర్శవలన ఎన్నో విషయాలు అస్పష్టంగా ఉండిపోవటం, పైగా అలాంటి విషయాలు చర్చింపబడ కుండానే, స్థిరపడిపోయి, సంవత్సరాల తరబడి చెలామణీ కావటం ఎలా జరిగిందో నా పుస్తకం చదివిన తర్వాత జనానికి తెలుస్తుందని నా నమ్మకం.

తెలుగు సాహిత్యంలో మొదటిసారిగా ఆడదానిపట్ల ఆదర్శ ప్రేమని రాసిన ఈ భావకవులంతా తమ మనసుల్లో ఆడదాని గురించి అదివరకే బలపడిపోయిన పాతభావాల నుంచి బయటపడలేక, తమ కాలంలో కొత్తగా వచ్చిన ప్రేమతో కవిత్వం రాయాలని సరదాపడి భావకవిత్వం రాసేరు. అందుకే పాత భావాలే ప్రేమ బురఖాతో మళ్ళీ రాయబడ్డాయి భావకత్వంలో. ఈ ప్రేమ ముసుగుని కాస్తా పక్కకిపెట్టి చూస్తే, వీళ్ళురాసిన భావకవిత్వానికి, అంతకు ముందున్న ప్రబంధ కవిత్వానికి పెద్ద తేడా ఏమీ కనిపించదు. ఈ రెండు కవిత్వాలలోని స్త్రీ రూపాలు ఊహా జనితాలే కాబట్టి సామాజిక వాస్తవికత వీటిలో కనిపించదు. అందుకనే ఆడదాని పట్ల ప్రేమని రాసిన భావకవులకి సయితం సమాజంలోని స్త్రీ విషయంలో మార్పు అవసరం లేకపోయింది. వీళ్ళు కవిత్వంలో రాసిన ఆడదానికి, వీళ్ళకాలంలో సమాజంలో బతికిన ఆడదానికీ అందుకనే పోలికలేకుండా పోయింది.

భావకవిత్వానికి ముందున్న కవిత్వంలో ఆడదాని పరిస్థితిని చూపిస్తేగాని భావకవిత్వంలో ఆడదాని గురించిన మార్పు ఏ స్థాయిలో జరిగిందీ తెలియదు కదా. అందుకనే నా పరిశోధనని ఈ కింది అధ్యాయాలుగా విభజించుకుని చేశాను.

మొదటి అధ్యాయంలో భావకవిత్వానికి పూర్వమున్న ప్రాచీన తెలుగు కవిత్వంలో స్త్రీ గురించి పరిశీలించాను. రెండవ అధ్యాయంలో భావకవిత్వపు స్త్రీ ఆవిర్భవించటానికి ప్రేరణనిచ్చిన ఇతర ప్రభావాల గురించి చర్చించాను. మూడవ అధ్యాయంలో భావకవులకు ముందరివాడైన గురజాడనీ, అతని కవిత్వం లోని స్త్రీని ప్రత్యేకంగా వివరించాను. నాల్గవ అధ్యాయంలో ప్రధానమైన భావ కావ్యాలనీ, ఆ కావ్యాలలోని స్త్రీపాత్ర చిత్రణనీ సమీక్షించాను. ఐదవ అధ్యా యంలో స్త్రీపట్ల భావకవుల దృక్పథమేమిటో విశ్లేషించాను. చివరగా కవిత్వంలో స్త్రీపట్ల రావాల్సిన మార్పుని చెబుతూ ఇప్పటికీ అభ్యుదయ కవిత్వం; విప్లవ కవిత్వంలో సైతం ఆడవాళ్ళ పట్ల ఇంకా ఆ పాత భావాలే కొనసాగటాన్ని సూచించాను.

అయితే వీటన్నిటి వెనకా నాఉద్దేశ్యం ఒక్కటే. ఆడవాళ్ళని గురించిన భావాలలో పాత ప్రమాణాలు పోయి కొత్త చూపు రావాలి. వీళ్ళ ఆలోచనల్లో

స్పష్టంగానూ, ఖచ్చితంగానూ పురుషాధిక్యతని సూచించే భావాలూ, భాషా పోవాలి. స్త్రీ చిత్రణ ఎప్పుడూ స్త్రీ పురుష సమానత్వానికి దారిచూపించేదిగానే వుండాలి

దీనికోసం ఆడవాళ్ళు చేయవలసిన పనికూడా ముఖ్యమైనది ఒకటుంది. ఆడవాళ్ళని శారీరకంగా మాత్రమే గుర్తించే పద ప్రయోగాలని కవులు, విమర్శకులు మార్చుకునేలా ఉద్యమస్థాయిలో ఆడవాళ్ళు ప్రతిఘటించాలి. అలాగే "అబలలు, పతివ్రతలు, పతితలు, కులటలు లేదా ముత్తయిదువలు, దేవతలు వగైరా ఊహలూ, ధర్మాలూ" ఆడవాళ్ళు అవగాహనతో వ్యతిరేకించాలి.

పురుష స్వామ్యపు ఆలోచనా విధానము, భాషా విధానమూ మారినప్పుడు మాత్రమే అభివృద్ధికరమైన మార్పు అటు జీవితాలలోను, ఇటు కవిత్వంలోను, విమర్శనా పద్ధతిలోనూ వస్తుంది.

ఆ రకమైన మార్పుకి ఈ విమర్శ ఒక మొదలు మాత్రమే.

12 ఆగస్టు 1988,
హైదరాబాదు.

జయప్రభ

# కృతజ్ఞతలు


ఈ విషయం మీద నాకు పరిశోధనకు అవకాశాన్నిచ్చిన ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు విభాగం వారికి,

అప్పటి తెలుగు శాఖకి అధ్యక్షులైన నాయని కృష్ణకుమారి గారికి,

కేవలం పర్యవేక్షకురాలిగా మాత్రమే కాకుండా మంచి స్నేహితురాలిగా కూడా ఎప్పటికప్పుడు తగిన సూచన లిస్తూ నాకు ఎంతగానో సహకరించిన పి. సుమతీనరేంద్ర గారికి,

తమదగ్గరున్న పుస్తకాలని నమ్మకంతో నా కిచ్చి నన్ను ప్రోత్సహించిన చేకూరి రామారావుగారికి, మొదలి నాగభూషణ శర్మగారికి, మిత్రుడు కళ్యాణ్ రామ్‌కి,

కృష్ణమూర్తిగారి చిత్రాన్ని నా పుస్తకానికి ముఖ చిత్రంగా వేసుకోవటానికి అనుమతి నిచ్చిన మొక్కపాటి రామకృష్ణ గారికి,

ఈ పుస్తకాన్ని చక్కగా అచ్చువేసి ఇచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌కి, ముఖ చిత్రాన్ని అచ్చువేసిన జ్యోతి ప్రెస్ వారికి, ముఖ చిత్రాక్షరాలు లిఖించిన శీలావీర్రాజు గారికి-

అందరికీ నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు.

—జయప్రభ

# విషయ సూచిక


| | | | |
|---|---|---|---|
| 1. | ప్రాచీన తెలుగు కవిత్వంలో స్త్రీ | ... | 1 |
| 2. | భావకవిత్వంపై ఇతర ప్రభావాలు | ... | 25 |
| 3. | గురజాడ కవిత్వంలో స్త్రీ | ... | 34 |
| 4. | భావకావ్యాలు-నాయికా చిత్రణ | ... | 38 |
| 5. | భావకవిత్వంలో స్త్రీ | ... | 73 |
| 6. | ముగింపు | ... | 93 |

## అధ్యాయం - ఒకటి

# ప్రాచీన తెలుగు కవిత్వంలో స్త్రీ

సమాజంలో స్త్రీ అనే ఆలోచనకి ఒక స్పష్టమైన, క్లిష్టమైన వ్యవస్థ ఉంది. ఈ ఆలోచన ఏర్పడిన తీరులో అనేక సామాజిక, ఆర్థిక పరిస్థితుల పాత్ర ఉంది. ఆ పాత్రలో సాహిత్యానికి ఒక ప్రత్యేకమైన ప్రాధాన్యం ఉంది.

ఆడా, మగ, అనే ఊహలు భిన్నమైన శారీరక నిర్మాణాలవల్ల ఏర్పడ్డవని మనం అనుకుంటాం. కానీ పుట్టుకతో వచ్చిన ఈ ఆకారాలకి మనలో ఏర్పడిన అర్థాలు సమాజం ఇస్తుందని, ఆ అర్థాలవల్లే ఆడతనం, మగతనం ఏర్పడతాయని మనం గుర్తించవలసిన అవసరం ఉంది.

**"One is not born, but rather becomes a woman"**[1] పుట్టుకతోనే ఎవరూ ఆడవాళ్ళుకారు, పుట్టిన తరువాత ఆడవాళ్ళుగా తయారవుతారు. సైమన్ ది బోవియర్ అన్న మాటకి అర్థం ఇది. **Second Sex** అన్న పుస్తకంలో ఆవిడ రాసిన ఈ వాక్యం స్త్రీని గురించిన ఆలోచనల్లో విప్లవాత్మకమైన మార్పులకి కారణమైంది.

ఈ వాక్యమే నా పరిశీలనకి ప్రధానమైన ప్రేరణ. తెలుగు సమాజంలో ప్రధాన భాగంగా సాహిత్యం స్త్రీని ఎలా రూపొందించిందన్న విషయం నాకు పరిశీలనాంశం. అంతవరకూ చాలా శతాబ్దాలనుంచీ ఒక స్థిరమైన రూపంలో స్త్రీని గురించిన ఆలోచనల నిర్మాణం వుండగా, భావకవిత్వంలో ఆ నిర్మాణం తీవ్రమైన మార్పుకి లోనయ్యింది.

తెలుగు సమాజం, ప్రపంచంలోని చాలా సమాజాల లాగా పురుషాధిక్య సమాజమే అని వేరే చెప్పక్కర్లేదు. ఆ సమాజ వ్యవస్థకి అనుగుణంగా - మన

---

1. **Simone Beauvoir, Second Sex** 1952 : 301

ప్రాచీన సాహిత్యంలో కూడా ఎక్కువ మంది కవులు పురుషులే అయ్యారు. వాళ్ళు ఆయా యుగాలలో వాళ్ళ వర్గం వారికి అనుకూలంగా వుండే స్త్రీ రూపాన్ని సాహిత్యంలో చిత్రించారు. ఆ చిత్రణ భావకవిత్వ యుగంలో ఎలా రూపొందిందో పరిశీలించడం ఈ వ్యాసంలో నేను సంకల్పించిన పని.

భావకవిత్వ యుగం అకస్మాత్తుగా మొదలయింది కాదు. దానికి నేపథ్యంగా పురాణ యుగం, ప్రబంధ యుగం వున్నాయి. భావ కవిత్వ యుగంలో ఈ పూర్వ యుగాల ప్రభావం పరోక్షంగానే కాకుండా, ప్రత్యక్షంగా కూడా ఉంది.

అంచేత ముందు క్లుప్తంగా పురాణ యుగంలోనూ, ప్రబంధయుగంలోనూ చిత్రితమయిన స్త్రీ స్వరూపాన్ని పరామర్శిస్తాను.

క్రీ॥శ॥ 11 వ శతాబ్దిలో నన్నయ్య భారతాంధ్రీకరణతో తెలుగులో లిఖితపూర్వకమైన సాహిత్య రచన మొదటిసారిగా, మనకు లభిస్తోంది. నన్నయ్య ప్రారంభించిన భారతాంధ్రీకరణని అటు తరవాత తిక్కన, ఎఱ్ఱనలు పూర్తి చేసారు. కవిత్రయం వారిది స్వతంత్ర రచన కాదు కాబట్టి వారి కవిత్వంలో కన్పించే స్త్రీ స్వరూపం కూడా వారి కాలం నాటిది కాదు, అని అనుకోవటానికి వలులేదు. కవిత్రయం వారి భారత రచన స్వతంత్ర రీతిలో సాగింది. వారి అనువాదం స్వేచ్ఛానువాదం. అదీగాక ఒక కవి యొక్క రచనలో తప్పకుండా అతని కాలానికి చెందిన సామాజిక స్వరూపం ఆనాటి ఆచార వ్యవహారాలు ఆ కాలానికి చెందిన కొన్ని ప్రత్యేక ధర్మాలు ప్రతిఫలిస్తాయి. అందుకనే కవిత్రయం వారి రచనకు అనువాదాన్ని మించిన ప్రాముఖ్యం ఉంది.

మొత్తంగా కవిత్రయం వారి భారత రచనను పరిశీలించినపుడు, వారు స్త్రీ పాత్రల పట్ల సానుభూతితో రచన కావించినట్లుగా కన్పిస్తుంది. భారతంలోని స్త్రీ పాత్రలన్నీ కూడా వారి వారి ప్రత్యేక మనస్తత్వంతో, వ్యక్తిత్వంతో ప్రకాశించాయి. ద్రౌపది, అంబ, కుంతి, గాంధారి, శకుంతల, దమయంతి, దేవయాని ఇలా ఏ స్త్రీ పాత్ర అయినా తమ ప్రత్యేకతను ప్రదర్శిస్తాయి.

అయితే స్త్రీ పాత్రల పట్ల వర్ణనాసక్తితో రచన చేయటం భారత కవులలో లేకపోలేదు. ఇంద్రుడుకు లామ దాస్యం చేయటానికి గల కారణాన్ని గురించి

ప్రశ్నిస్తూ గరుడుడు తన తల్లిని అమ్మా! అని కాక 'వరవర్ణినీ!'[1] - అని సంబోధిస్తాడు. ఇలాగే వాసుకి తన సోదరి జరత్కారుడుకు ఆస్తీకుని జన్మసాఫల్యాన్ని గురించి చెబుతూ ఆమెను 'అంబుజ నేత్రా!'[2] - అని సంబోధిస్తాడు. ఇలా అక్కడక్కడా పాత్రకు అన్వయించని వర్ణనాత్మక సంబోధనలు కన్పిస్తాయి.

వివాహ విషయంలో భారత స్త్రీలలో స్వేచ్ఛ ఉన్నట్లుగా అన్పిస్తుంది. దేవయాని తన ఇష్టం మీద యయాతిని కోరి వివాహం చేసుకుంటుంది. హిడింబ భీముని వరిస్తుంది. ఉలూచి అర్జునుని వలచి పెళ్ళాడుతుంది. అలాగే తనని వదలి వెళ్ళిన నలుని జాడ తెలుసుకోవటం కోసం దమయంతి ద్వితీయ స్వయంవరానికి సిద్ధపడుతుంది. అయితే స్వయంవరం జరిగిన అన్నిచోట్లా స్త్రీ ఇష్టంమీద మాత్రమే వివాహం జరిగిందనటానికి వీలులేదు. యుద్ధాలలో, సంధిప్రయత్నాలలో వివాహం అనేది కూడా ఒప్పందంగా ఉండేది. ఓడిన వారి స్త్రీలు గెలిచిన వారి స్వాధీనమవటం జరిగేది.

భారతంలో స్త్రీలు తమ జీవితానుభవాలతో రాటుదేరి, వారి మనస్తత్వాలకు అనుగుణంగా సజీవంగా ప్రవర్తిస్తారు. తనకు జరిగిన అన్యాయానికి భీష్మునిమీద ప్రతీకారం తీర్చుకున్న అంబ,[3] తనకు పుట్టిన కొడుకుకే దుష్యంతుని తరువాత రాజ్యాధికారం రావాలని షరతుపెట్టి, దానికి దుష్యంతుడు అంగీకరించిన తరువాతనే అతడిని పెళ్ళాడిన శకుంతల,[4] తనకు జరిగిన పరాభవానికి కారణమైన ధర్మరాజుని (అతడు తన భర్త అయినాసరే) విమర్శించటానికి, వెనుదీయని ద్రౌపది,[5] ఇలా ఈ స్త్రీ పాత్రలలో అటు తర్వాత కాలంలోని కావ్యాలలో స్త్రీ పాత్రలకి పులమబడిన ముగ్ధత్వం, అనవసరమైన బిడియం, అమాయకత్వం వంటివి కన్పించవు. పై పాత్రలన్నీ తమ ఆలోచనలన్నింటినీ నిర్భయంగా వెల్లడిస్తూ ఉంటాయి.

1. సంశోధిత మహా భారతం (ఉస్మానియా విశ్వవిద్యాలయం ప్రచురణ) ఆది పర్వం - 2.48.
2. Ibid ఆది పర్వం - 2.218.
3. Ibid ఉద్యోగ పర్వము - 4.621.
4. Ibid ఆది పర్వం - 4.60.
5. Ibid విరాట పర్వం - 2.152.

"గుణవంతురాలు, రాజ్ఞి, పతివ్రత యైన స్త్రీని, భార్యను అవజ్ఞాన్విత దృష్టిఁ జూచు నతి దుర్మతి"[1] - గా, దుష్యంతుని వ్యంగ్యంగా ఉద్దేశిస్తూ అలాంటి వాళ్ళకు ఇహమూ, పరమూ కూడా ఉండవని హెచ్చరిస్తుంది శకుంతల. కీచకుని చేత పరాభవింపబడిన ద్రౌపది, విరాటుని న్యాయం అడుగుతూ మాట్లాడి నపుడు అదే సభలో కంకుభట్టుగా ఉన్న ధర్మరాజు "నాట్య కత్తెలా సభలో నిలిచి మాట్లాడటం కులసతికి తగదని" ద్రౌపదిని పరోక్షంగా హెచ్చరించి నపుడు ఆమె అతనికి ఇలా సమాధానమిస్తుంది.

> "నాదు వల్లభుండు నటుడింత నిక్కంబు, పెద్దవారి యట్ల పిన్నవారుఁ
> గానఁ బతుల విధమ కెక యే శైలూషిఁ గా ననంగ రాదు కంకభట్ట!"[2]

అని విమర్శించి అయినా "జూదరి యాలికి గఱువతనం బెక్కడిది?" అంటూ ధర్మరాజునే దెప్పిపొడుస్తుంది. ద్రౌపది పాత్ర తన ఆత్మ గౌరవానికి భంగం కలిగిన సందర్భాలలో చాలా తీవ్రమైన ఆవేశంతో కన్పిస్తుంది. తనని అవమానించిన కీచకుని గనక సంహరించకపోతే ''ఉరి పోసుకునైనా, నీటిలో మునిగైనా, అగ్నిలో దహించుకు పోయైనా, విషం తీసుకునైనా చనిపోతాను. నీమీద ఒట్టు![3] - అని పలికిన ద్రౌపదిలో మచ్చుకైనా బేలతనం కన్పించదు. ద్రౌపది పాత్రలో ఆ రాజసాన్ని, ఆ పౌరుషాన్ని స్పష్టంగా కన్పింపజేస్తూ రచించాడు తిక్కన. గాంధారికున్న విచక్షణా జ్ఞానం, కుంతి కన్పరిచే మాతృ ప్రేమ, ఇవన్నీ సహజమైన రీతిలో చిత్రింపబడి ఆ స్త్రీ పాత్రల ప్రత్యేకతను నిలబెట్టాయి.

## కవిత్రయం స్త్రీలు - పాతివ్రత్యం :

భారతంలోని స్త్రీలు విడివిడిగా తమ ప్రత్యేక వ్యక్తిత్వాలతో ప్రవర్తించినా వారంతా పతివ్రతలుగా కనబడటంలో మాత్రం ఏకత్వాన్ని కనబరచేలా రచించారు కవిత్రయం. వీరి రచనలో చాలాచోట్ల పతివ్రతా ధర్మాన్ని గురించిన

---

1. మహాభారత సంశోధిత ముద్రణము (ఉ.వి.ప్రచురణ) ఆది పర్వం-4.82.
2. Ibid విరాట పర్వం - 2.152.
3. Ibid విరాట పర్వము - 2.229.

చర్చ ప్రత్యేకంగా, కన్పిస్తూ ఉంటుంది. ప్రత్యేకించి స్త్రీ పాత్రల ద్వారానే, ఈ ధర్మ ప్రచారం చేయబడటం గమనింప తగ్గది. భారతంలోని ప్రధాన స్త్రీ పాత్రలన్నీ ఈ ధర్మానికి ప్రతీకలుగా మలచబడ్డవే. ఎఱ్ఱన రచనలో ఎక్కువగా ఈ పాతివ్రత్య చర్చ కన్పిస్తుంది. ద్రౌపది, సత్యభామకు పతివ్రతా ధర్మాలు చెబుతుంది.[1] మార్కండేయుడు ధర్మరాజుకి పతివ్రతా మాహాత్మ్యం చెబుతాడు [2] తిక్కన రచనలో కూడా పార్వతి శివునికి ఈ ధర్మాలన్నీ చెబుతుంది.

పార్వతి వివరించిన పతివ్రతా లక్షణాలు ఈ క్రిందివి :

"తల్లి, తండ్రి, సోదరుడు, మాతులుడు వెతికి తెచ్చినవాడే కన్యకు వరుడు పతి ఆజ్ఞను సతి మీరకూడదు. ధర్మకార్యాలనైనా అతని ఆజ్ఞకు లోబడే నిర్వ ర్తించాలి. నాథుడు వలచిన వంటకములను వండిపెట్టాలి. అతను కోరినపుడు హృదయమివ్వాలి. చెప్పిన పనులన్నీ మారుపలుకకుండా చేయాలి. సవతి కల్గినా సరే పోరు పెట్టుకోకూడదు. తన పతి మరొక స్త్రీని వలచినపుడు అతని కోరికని భార్య తీర్చగలగాలి. అటువంటి ఆమె నిజమైన పతివ్రత, ఆమె దైవం వంటిది"- అంటుంది పార్వతి.

"తన సంపదనంతా భర్త పరం చేయాలని, పతి తనకేమి ఇస్తే అదే సంతోషంతో స్వీకరించాలని, భర్త ధనవంతుడైనా, పేదవాడైనా, రూపసైనా, కురూపి అయినా, వివేకుడయినా, మూఢుడైనా, అరోగుడైనా, రోగిష్టి అయినా అతని గుణములను ఎంచకుండా అతనిని అనుసరించటమే పతివ్రతకు ధర్మం"[3] అని వివరిస్తుంది పార్వతి.

---

1. శ్రీమదాంధ్ర మహాభారతము - సంశోధిత ముద్రణము (ఉ.వి. ప్రచురణ) అరణ్య పర్వము - 5.445.
2. **Ibid** పేజీ : 382.
3. **Ibid** అనుశాసనిక పర్వం - పేజీ : 374, 375.

ఈ ధర్మాలను పరిశీలించినపుడు ఒక పద్ధతి ప్రకారం సాంఘికంగా స్త్రీలను అణచివేయటం జరిగిందని తెలుస్తుంది. స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యాన్ని లేకుండా చేసింది ఈ ధర్మం ఆమెకు స్వంత ఆలోచన లేకుండా చేసి, భర్త ఏమి చెప్పినా బానిసలాగా చేసేటట్లుగా స్త్రీని శాసించింది ఈ ధర్మం. సమాజంలోని పురుషాధిక్యతను బలపరచటానికి ప్రత్యేకించి స్త్రీలకోసమే ఈ పతివ్రతాధర్మం ప్రచారం చేయబడిందన్న విషయాన్ని ఋజువు చేస్తాయి పార్వతి మాటలు.

అందుకే ద్రౌపది, కుంతి, గాంధారి వంటి పాత్రలను ప్రాణవంతంగా తీర్చిదిద్దిన తిక్కన కూడా చివరికి పార్వతి పాత్ర ద్వారా ఈ పతివ్రతా ధర్మాలని ప్రచారంచేయక తప్పలేదు. దీనినిబట్టిచూస్తే గౌరవనీయమైన స్త్రీ మహా పతివ్రత కూడా కావాలన్నది, కవిత్రయంవారి అభిప్రాయంగా కనబడుతుంది. స్త్రీ పాత్రల ఔన్నత్యాన్ని వారి పతివ్రతాధర్మంయొక్క స్థాయినిబట్టి నిర్ణయించే వారని తెలుస్తుంది. అందుకే తన ప్రమేయం లేకుండానే అర్జునునితోపాటు మిగతా నలుగురు పాండవులను పెళ్ళాడిన ద్రౌపది[1] దూర్వాసుని వరప్రభావం వలన పాండురాజు కోరిక ననుసరించి ఆయా దేవతల ద్వారా సంతానవతియైన కుంతి[2], అంధుడైన భర్తకోసం జన్మంతా తాను కూడా కళ్ళకు గుడ్డ కట్టుకుని అంధురాలిగా బ్రతికిన గాంధారి,[3] నలుడు తనను అడవిలో ఒంటరినిచేసి వెళ్ళిపోతే తిరిగి నలుని కలిసేదాకా సైరంధ్రిగా బ్రతికిన దమయంతి, దుష్యంతుడు నిరాకరిస్తే ఎన్నో కష్టాలకోర్చి భరతుని పెంచిన శకుంతల - వీళ్ళంతా వంచితలుగా చిత్రీకరింపబడక మహాపతివ్రతలుగా పేర్కొనబడ్డారు.

కవిత్రయం వారి రచనలో కొన్ని పాత్రలు వెల్లడించిన అభిప్రాయాలను పరిశీలిస్తే నాటి సమాజంలోని స్త్రీ యొక్క పరిస్థితి ఎలా ఉండేదో తెలుస్తుంది. ఎఱ్ఱన రచనలో - ఆశ్రమంలో ఒంటరిగా ఉన్న ద్రౌపదని చూసి సైంధవుడు బలాత్కారం చేయబోతాడు. ఆమె అతనిని మందలించి తను సైంధవునికి సోదరి

---

1. మహాభారతం - సంశోధిత ముద్రణం ఆదిపర్వం - పేజీ : 453, 454.
2. Ibid ఆదిపర్వం - 5 90.
3. Ibid ఆదిపర్వం - 5 12.

వావి అని గుర్తుచేస్తుంది. అపుడు సైంధవుడు ద్రౌపది నీతులకు సమాధానంగా తన భావాలను వెల్లడిస్తాడు. అతని ఆ మాటలలో స్త్రీ, పురుషునికి కేవలం భోగ్యవస్తువు అన్నది స్పష్టమౌతోంది. ఆ మాటలు ఇవి:

"వనజాక్షి రాజ ధర్మము
వినవే ఎన్నడును మనుజ విభులకు బ్రమదా
జనుల యెడ వావి వెదకం
జనదు వలసినట్ల వేడ్క సలుపగ జెల్లున్"[1]

- అని చెబుతూ "జగమున వనితారత్నంబు లెల్లవారికి భోగంబునయెడ సాధారణంబు" - అని స్త్రీల గురించిన అభిప్రాయాన్ని వెల్లడిస్తాడు. స్త్రీ ఆనాటి సమాజంలో భోగవస్తువుగా చూడబడిందనటానికి సైంధవుని పైమాటలు సాక్ష్యమిస్తున్నాయి.

స్వర్గారోహణ పర్వంలో అందరికన్న ముందుగా మృతిపొందిన ద్రౌపది అవస్థను గురించి భీముడు ధర్మరాజును ప్రశ్నిస్తే, దానికి కారణం ధర్మరాజు ఇలా చెబుతాడు: "ద్రౌపది పాండవుల నందరినీ ఎంత సమానంగా ఆదరించినప్పటికీ మనసులో ఆమెకు అర్జునునిపట్ల ప్రత్యేకమైన అభిమానం కల్గి ఉండటమే అందుకు కారణ"మని అంటాడు.[2] నిజానికి అర్జునునికి భార్యకాగల కూతురు నివ్వమని వరమడిగి ద్రౌపదికి జన్మనిస్తాడు ద్రుపదుడు. స్వయంవరంలో మత్స్యయంత్రాన్ని ఛేదించి ద్రౌపదిని వివాహమాడినవాడు కూడా అర్జునుడే. కేవలం కుంతీదేవి మాటకోసం ద్రౌపది పంచపాండవ పత్ని అవుతుంది. ఆమె మనసులో అర్జునునిపట్ల ప్రత్యేకమైన అభిమానం ఉండటం చాలా సహజం. అయితే ఆమె ఈ అభిమానాన్ని ఒక తప్పుగా పేర్కొంటాడు ధర్మరాజు. దీనినిబట్టి స్త్రీకి తను ఇష్టపడిన వాడిని మనసులో కూడా ప్రత్యేకంగా అభిమానించటానికి వీలు లేకండా ఎన్ని ఆంక్షలు ఉండేవో తెలుస్తుంది.

---

1. ఆంధ్ర మహాభారతం-సంశోధిత ముద్రణం అరణ్యపర్వం-6 171-172
2. Ibid మహాప్రస్థానికపర్వము - ఏకాశ్వాసం పేజీ: 370.

## స్త్రీ సౌందర్యాన్ని వర్చస్సుతో పేర్కొన్న కవిత్రయం :

కవిత్రయం వారు స్త్రీ సౌందర్యాన్ని అంగాంగ చిత్రణతో కాక ఆమె ముఖ వర్చస్సుతో వర్ణించారు. నన్నయ్య శకుంతలని పయోజ దళాయతాక్షి గాను, సంకుల మిళితాళినీల పరికుంచిత కోమలకుంతల[1] గాను వర్ణిస్తాడు. నన్నయ్య కూడా ద్రౌపది సౌందర్యాన్ని చూసి గాంధారి కోడళ్ళు ఆశ్చర్య పడినందుకు కారణం ఆమె కాంతి అని చెబుతూ ఇలా అంటాడు:

> ''అఖిల లావణ్యపుంజంబు నబ్జభవుడు
> మెలతగా దీనియందు నిర్మించెనొక్కొ
> కానినాఁడిట్టి కాంతి యే కాంత లందు
> నేల లేదని సామర్ష హృదయ లయిరి''[2]

ఇక్కడ నన్నయ కాంతితో ద్రౌపదీ సౌందర్యంలోని అద్వితీయతని చాలా చక్కగా వర్ణిస్తాడు. అంతేకాదు చివరికి కీచకుని వంటి ఉద్ధతుని పాత్ర ద్వారా ద్రౌపదీ వర్ణన చేయించవలసిన సందర్భంలో తిక్కన కూడా ''ఆమె కన్నుల కాంతిని, నెమ్మోముిలోని సొంపుని, దంతమౌక్తిక రుచినీ,''[3] వర్ణింప చేస్తాడు కానీ శరీర వర్ణన చేయడు. తమ్మని వద్దకు నడచివస్తున్న సుధేష్ణ నడకని తదనంతర కవుల మాదిరిగా అదిరే కుచాలనీ. అల్లలనాడే లేనడుమునీ కాక ''లలితంబులగు మట్టియల చప్పుడింపారగా[4]'' వర్ణిస్తాడు తిక్కన, ఎఱ్ఱనకూడా ద్రౌపదిని ''లాలిత దేహకాంతి పటలంబునన్ జేసి వెలుగు వినీల కుంతల విభాసిని''[5] గానే చిత్రిస్తాడు. అయితే స్త్రీ సౌందర్య వర్ణనపట్ల కవిత్రయంలో కన్పించే ఈ సంయమనం, వారి తరువాతి కవులలో ఎవ్వరిలోనూ కన్పించదు.

---

1. ఆంధ్ర మహాభారతం - సంశోధిత ముద్రణము (ఉ వి. ప్రచురణ) ఆదిపర్వం - 4 25.
2. **Ibid** సభాపర్వం - పేజీ : 68.
3. **Ibid** విరాటపర్వం - 2.45.
4. **Ibid** విరాటపర్వం - 2.64.
5. **Ibid** అరణ్యపర్వం - 6.145, 148.

## కావ్యయుగం - స్త్రీలు :

కవిత్రయ యుగాన్ని దాటి కావ్యయుగానికి వచ్చేసరికి స్త్రీపట్ల దృక్పథంలో మార్పు వచ్చింది. ప్రబంధ కాలంలో ఎక్కువైపోయిన స్త్రీ అంగాంగ వర్ణనలకి కావ్యయుగంలోని కవులే నాంది పలికారు. శ్రీనాథుని శృంగార నైషధంలో హంస నలునికి దమయంతిని గురించి చెబుతూ "హాటక కలశంబులకును బాటియగు వధూటి, మెఱుఁగుఁ బాలిండ్లు[1]" - అంటూ దమయంతీ శరీర వర్ణన చేస్తుంది. ఆ హంసే దమయంతితో "మహిత బంధాఢ్య రతికేళి మల్లయుద్ధాల"ని గురించి కూడా మాట్లాడుతుంది ఈ విధంగా కథలో పాత్రలపట్ల ఔచిత్యం కన్నా శృంగారానికి ప్రాముఖ్యం పెరిగిపోయింది శ్రీనాథునితోనే. శ్రీనాథుని దగ్గరకు వచ్చేసరికి స్త్రీ ముగ్ధగా, బేలగా మారిపోయింది. ఆమె కార్య నిర్ణయ శక్తి లేనిదిగా, తండ్రిచాటు బిడ్డగా - గుర్తింపబడింది. కావ్యయుగంలో కూడా స్త్రీకి పాతివ్రత్యాన్ని గురించిన బోధన చేయబడుతూనే ఉంది. దమయంతిని నలునితో అత్తవారింటికి పంపిస్తూ ఆమె తండ్రి "భవ్య పతిదేవతాచార పరమ పుణ్య ధర్మాన్ని ఏమరవొద్ద"ని హెచ్చరిస్తాడు. ఈ ధర్మం జాతి బేధం లేకుండా స్త్రీత్వం ఉన్న అన్నింటికి అన్వయిస్తూ రచన చేసారు కవులు. అందుకే శ్రీనాథుడు చిత్రించిన హంస కూడా నలునితో తన కుటుంబం గురించి చెబుతూ తన ఇల్లాలిని "కడు సాధ్వి, యేమియు నెఱుగదు, పరమ పాతివ్రత్య భవ్యచరిత"[2]గా, పేర్కొంటుంది.

ఈ యుగానికి వచ్చేటప్పటికి స్త్రీని వర్ణించే సందర్భంలో ఆమె దేవతా స్త్రీ అయినా, మానవకాంత అయినా చివరికి సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి అయినా గాని కవుల వర్ణనలో ఆమె శరీరం మాత్రమే కొలవబడింది.[3]

---

1. శ్రీనాథుడు శృంగార నైషధము - 2.17.
2. Ibid 2.66.
3. ఈ హేమంతము రాకకు శ్రీహరి యొకింత వడఁకి చింతింపగా
నాహా! వెఱవకుమని తా మా హరికిని శ్రీ కుచంబు లభయం బిచ్చెన్
(పోతనఆంధ్ర మహాభాగవతం - 10.806.)

తనని ప్రేమించి వచ్చిన గోపికలతో కృష్ణుడు స్త్రీకి గల పతివ్రతా ధర్మాలని గుర్తుచేస్తూ "ఆడువారికి సనాతన ధర్మము పెనిమిటిని భజించుటే"[1] అని వివరిస్తాడు. అందరూ తనకు సమానం అని చెప్పే దేవునిచేతనే, ఆడదాని స్థానాన్ని నిర్దేశిస్తూ రచించిన పోతన తిరిగి ఆ దేవుడు అష్ట భార్యలతో, పదహారు వేల మంది భామలతో క్రీడించటాన్ని దివ్యంగా కీర్తిస్తూ అతని దక్షిణ నాయకత్వాన్ని వర్ణిస్తాడు.

బృహస్పతి తన అన్న ఇల్లాలిని, పైగా చూలాలిని అనుభవించటాన్ని వర్ణిస్తూ,[2] దానిని ఒక అత్యాచారంగా కూడా కనీసం గుర్తించడు కవి. దీనిని బట్టి మామూలు మగవాడైనా దేవతా పురుషుడైనా వారి విచ్చలవిడి ప్రవర్తనను కీర్తించి, దానిని గొప్పగా వర్ణించిన కవులు పురుషుల కాముక ప్రవృత్తినీ, స్త్రీని భోగ దృష్టితో చూసే మగవారి భావాలని ఎలా సమర్థించారో తెలుస్తుంది.

పోతన వర్ణించిన రుక్మిణీ సౌందర్యం,[3] అటు తర్వాత కాలంలో వచ్చిన ప్రబంధాంగనల వర్ణనకు ఏమాత్రమూ తీసిపోదు. కాకపోతే రుక్మిణి తన వివాహ విషయంలో చూపిన చొరవలోను, సత్యభామ "రణ క్రీడా మహోత్కంఠ"తో నరకునితో భీకరమైన యుద్ధాన్ని చేయటంలోను స్త్రీలోని చొరవనీ, సాహసాన్నీ చూపించాడు కవి.

## ప్రబంధ యుగం - స్త్రీలు :

ప్రబంధ యుగానికి వచ్చేటప్పటికి ఈ కవులంతా స్త్రీని వర్ణించవలసివచ్చి నప్పుడు ఆమె దేవతా స్వరూపిణి అయినా, రాజకాంత అయినా, కాపు పడతి అయినా, వేశ్య అయినా ఆమె అంగాంగ వర్ణన చేయటంలో మాత్రం ఏ భేదమూ పాటించలేదు. పెద్దన దగ్గరకు వచ్చేసరికి స్త్రీ స్వరూప చిత్రణలో కవిత్రయం వారి వద్దనున్న వర్చస్సుకి ప్రాధాన్యత పోయి "శత పత్రేక్షణగా, చంచరీక

1. పోతన ఆంధ్ర మహా భాగవతము - దశమస్కంధము 1127.
2. Ibid - 9.640.
3. Ibid 10.1691.

చికురగా, చంద్రాస్య, చక్రకస్తని, నతనాభి నవల"[1]గా రూపొందింది స్త్రీ. ప్రబంధ కావ్యాలలో సందర్భం లేకపోయినా వర్ణనాత్మక సంబోధనలు తరుచుగా స్త్రీ పట్ల కన్పిస్తూ ఉంటాయి. పరస్త్రీ వ్యామోహం లేని ప్రవరుడు కూడా వరూధినితో మొదటిసారే "భీత హరిణేక్షణా!" - అంటూ, సంభాషణ మొదలు పెడతాడు వరూధినిని ఉద్దేశిస్తున్నట్లుగా మాత్రమే కాకుండా స్త్రీలందరికీ అన్వయించేలా "క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్ '[2] అంటూ వ్యాఖ్యానం చేసిన అల్లసాని పెద్దన రాను రానూ తన తరవాతి కవులంతా స్త్రీ మీద విపరీతమైన వ్యాఖ్యానం చేయటానికి మార్గాన్ని చూపిన వాడయ్యాడు.

స్త్రీ లోని బేలతనం, అమాయకత్వం, సహనం వీటనే శృంగారంగా చిత్రించిన ప్రబంధ కవులకి మరికాస్త తేడాగా సాహసం, ప్రథమ కోపం, ప్రేమ వీటిని కూడా జోడించి సత్యభామ రూపాన్ని తయారు చేసాడు నంది తిమ్మన తన పారిజాతాపహరణంలో.

సత్యభామ నిర్మొహమాట వైఖరి, "ఓర్పొక యింతలేని" ఆమె మనస్తత్వం, ఆమెలోని స్వాభిమానం, అలక ఇవన్నీ సత్యభామ స్వతంత్రురాలేమో అన్న భ్రాంతిని కల్గిస్తాయి. కానీ కాదు. అయితే మిగతా కవుల మాదిరిగా తిమ్మన ఎక్కువగా సత్యభామ అంగాంగాలని వర్ణించటం చెయ్యలేదు.

బహుశా అరణపు కవిగా వచ్చి రాజు, రాణీల మధ్య తగాదాని తీర్చే ప్రయోజనాన్ని ఉద్దేశించి తిమ్మన పారిజాతాపహరణాన్ని రాసినట్టు మౌఖికంగా కథొకటి ప్రచారంలో ఉంది. దీన్నిబట్టి ఇతని గ్రంథాన్ని చదివే పాఠకులలో ఉద్దేశించిన వాళ్ళలో అంతఃపుర పరివారము ఉండటమూ, ప్రత్యేకించి రాణివే ఇందులో సత్యభామ పాత్రకి మూలం కావటమూ, అందువలన తిమ్మన ఆ పాత్రని కాస్త సంయమనంతో చిత్రించటానికి కారణం కావొచ్చు. ఎందుకంటే సత్యభామ పట్ల చేయకపోయినా, రుక్మిణిపట్ల తిమ్మన యథాపూర్వంగా శరీర వర్ణన చేస్తాడు.

---

1. అల్లసాని పెద్దన మను చరిత్రము - 1.26
2. **Ibid - 3.69.**

మరొక ముఖ్యమైన అంశం ఏమిటంటే, స్త్రీని వర్ణించే సందర్భంలో ఆమె శరీర అవయవాలకి ప్రాధాన్యత నిచ్చే పదాలు, పురుషుణ్ణి వర్ణించే సందర్భాలలో అతని పరాక్రమానికి ప్రాధాన్యత నిచ్చే పదాలని కవులు ఎక్కువగా వాడడం గమనించవచ్చు.

తిమ్మన్న సత్యభామ అలకని అభిజాత్యాన్ని ప్రత్యేకంగా చూపించినా అవి కూడా పురుష ప్రపంచపు భోగ లాలసతకి ఉపకరణంగా వాడుకోవటానికే పనికొచ్చాయి. అలక కూడా శృంగారంలో ఒక భాగమే తప్ప ఆమె స్వతంత్ర వ్యక్తిత్వాన్ని సూచించేదిగా అన్పించదు. మూసలాగా అన్పించే పతివ్రతల కన్నా ప్రత్యేకంగా కన్పించటం కోసం సత్యభామ ప్రథమకోపం అభిజాత్యం కవికి పనికొచ్చాయి.

ప్రబంధ కాలంనాటి సమాజంలో స్త్రీ కేవలం భోగవస్తువుగా మాత్రమే చూడబడిందనీ,[1] బానిసలాగ ధనమిచ్చి కొనుక్కోబడేదనీ తెలుస్తుంది. తెనాలి రామకృష్ణ కవి తన పాండురంగ మాహాత్మ్యంలో నిగమశర్మ పాత్రద్వారా ఇలా చెప్పిస్తాడు:

"ఎల్లరు నెల్లచో ధనము లిచ్చి మృగాక్షుల కొంద్రు గాని యో
పల్లవపాణి ! యేఁ బరమ పావన వంశము నిచ్చి కొంటి"[2]

స్త్రీల స్థితి మీద కవుల కావ్యాలలో ప్రకటితమైన ఇటువంటి సాక్ష్యాలు ఆనాటి సమాజంలోని స్త్రీల పరిస్థితిని వివరిస్తున్నాయి. ఇంట్లో భార్యని కన్నెత్తి చూడకుండా సానికొంపలు పట్టిపోతున్నాడని బాధపడి నిగమశర్మ అక్క అతనితో నీకంతగా కోరిక ఎక్కువైతే, "రూపగుణశీల కులోన్నతి గల్గు విప్రకన్యా మణు లన్ సహస్రమయిన వరియించి రమించరాదె ? యేమీ మునులే గృహస్థులు ! రమించుట యెగ్గె కులాంగనాతతిన్"-[3] అని సలహా ఇస్తుంది. ఒక పురుషుడు

---

1. "పొగలేని ముర్మురములు మగువల పాలిండ్లు భోగమహనీయంబుల్"
(తెనాలి రామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యం - 4-91.)
2. Ibid - 3-93.
3. Ibid - 3 41

తనకు కావనసిన స్త్రీలనెంతమందినైనా వివాహం చేసుకోగల వీలుని సూచిస్తున్నాయి నిగమశర్మ అక్కగారి మాటలు.

ఒకమగవాడు ఎందరు స్త్రీలనైనా పెళ్ళాడటంలో తప్పేమీలేదని చెప్పించిన రామకృష్ణకవే, కాపువాని కోడలు నిగమశర్మపై మరులు గొనటాన్ని గురించి వ్యాఖ్యానిస్తూ -

"ఉవిదలకు బుద్ధి పెడతల నుండు గాదె"[1] - అని తీర్మానించేస్తాడు ఎందరో స్త్రీలతో రమించే పురుషుని దక్షిణ నాయకునిగాను, తనకు నచ్చిన మగవాని వెంట వెళ్ళిన స్త్రీని "పెడబుద్ధి గలదాని" గాను, చిత్రించిన కవి స్త్రీ పట్ల ఎటువంటి చులకన భావాన్ని కల్గి ఉన్నాడో తెలుస్తుంది. ఇది కేవలం రామలింగని వ్యాఖ్యానం మాత్రమే కాదు, ఆ కాలంలో సర్వత్రా వ్యాపించిన పురుషాహంకారాన్ని ఇది సూచిస్తోంది

ప్రబంధాలలో కూడా నాయికలు, ఇతర ముఖ్య స్త్రీ పాత్రలు అందరూ పతివ్రతలే. అయితే మరీ కొన్నిచోట్ల స్త్రీలు పతివ్రతలుగా కూడా కాకుండా కేవలం ఒక బానిస లాగా ప్రవర్తించిన సందర్భాలుకూడా కనిపిస్తాయి. పింగళి సూరన కళాపూర్ణోదయంలో ఒక జంట అయిన సుముఖాసత్తి, మణి స్తంభులు సింహవాహనం పై సముద్రాన్ని దాటుతున్నప్పుడు, ఆ సముద్రాన్ని చూసి ఉద్రేకపూరితుడైన మణిస్తంభుడు తన కోర్కెని సుముఖాసత్తికి వెల్లడిస్తాడు. అప్పుడు ఆమె ఒక పతివ్రతలాగా మీ యిష్టమే నా యిష్టం అని కూడా అనదు.

> "మీకు వలసిన విధంబునం బ్రవర్తిలుట గాక
> యెందు నాకు స్వతంత్రత్వ మెక్కడి యది!"[2] - అని అంటుంది.

భర్తయైనవాడికి కోరిక పుట్టినపుడు భార్య దానికి మానసికంగా, శారీరకంగా సంసిద్ధురాలు కాకపోయినప్పటికీ ఒక విధిగా ఆమె భర్తకు లోబడటాన్ని

---

1. తెనాలి రామకృష్ణకవి - పాండురంగమహాత్మ్యము - 3.81.
2. పింగళిసూరన కళాపూర్ణోదయం - 4.205.

పై మాటలు వ్యక్తీకరిస్తాయి. పతివ్రతాధర్మం పేరిట స్త్రీని ఈ రకంగా అణచి వేయటంలో ప్రబంధకవులంతా ఒకే బాటలో నడిచారు.

"చిచ్చుఱికి జొచ్చు వికచ రాజీవనేత్ర
కశ్వమేధంబు ఫలము తథ్యంబు గలుగు"[1]

అంటూ భర్త చితితోపాటు సతికూడా సహగమనం చేస్తే అది చాలా పుణ్యమని బోధించారు ఆనాటి కవులు.

## అనంతర ప్రబంధయుగం - స్త్రీలు :

ఈ యుగంలో వచ్చిన ఏ సాహితీ ప్రక్రియలో అయినా స్త్రీ సౌందర్యం అతిగా వర్ణించబడింది. పదసాహిత్యంలో కూడా స్త్రీ పట్ల చాలా అసభ్యకరమైన అభిప్రాయాలూ వర్ణనలూ చేశారు ఈ యుగపు కవులు. క్షేత్రయ్య పదాలలో మితిమీరిన వర్ణనలు, అసభ్యకరమైన మాటలు చాలా కన్పిస్తాయి.

"మగని కన్న దొంగమగని పొందే మేలు"
"కులుకు గుబ్బల తొమ్ముం గ్రుమ్మట"
"బంగారు బంతుల వంటి చిన్న చన్నులు"[2]

మొదలైన మాటల్లో కవి చేసిన వర్ణనలు ఎంతగా దిగజారిపోయిఉన్నదీ తెలుస్తుంది.

క్షేత్రయ్య పదసాహిత్యంలోనే కాదు, అనంతర ప్రబంధ యుగంలో పుంఖానుపుంఖాలుగా వెలువడిన ప్రబంధాలలో స్త్రీల స్థానం మరీ అట్టడుగుకు పోయి కన్పిస్తుంది. ఇటు తంజావూరులో విజయరాఘవ నాయకుడూ, అటు మధురలో ముద్దళగిరి నాయకుడూ తాము సాక్షాత్తూ శ్రీకృష్ణులమనుకొని వచ్చి

---

1 శ్రీనాథుడి కాశీఖండం - 2.86.

2. దివాకర్ల వెంకటావధాని సాహిత్యోపన్యాసాలు, క్షేత్రయ్య - పద సాహిత్యం, పేజీ : 51.

కాముకులై ప్రేమించారు వాళ్ళ కాముక చర్యలను పద్యాలు తెగపొగిడారు. వాళ్ళ వ్యభిచారం ప్రచారం పొందింది [1]

ఈ కాలంలో విరివిగా రచన చేసిన స్త్రీల కావ్యాలలో కూడా అతివేల శృంగారమే కన్పిస్తుంది. ముద్దుపళని రాధికాస్వాంతనంలో, పళని వర్ణించిన రాధ పురాణాలలోని రాధ కాదు. ఈ రాధ ఆనాటి తంజావూరులో పేరొందిన వేశ్యా రత్నంగా గోచరిస్తుంది. అలాగే కృష్ణుడు కూడా ఆనాటి దక్షిణాంధ్ర నాయక ప్రభువో, మరియొక దండనాయకుడో ఎవరైనా కావచ్చు. దక్షిణ నాయకుడుగా క్రీడించే పురుషుని స్త్రీలోలత్వాన్ని దానివలన ఆ స్త్రీలలో అంకురించిన అసుయా ద్వేషాలని వివరంగా చిత్రించింది ముద్దుపళని.

ఈ కావ్యంలో రాధ కృష్ణుని కలవటం కోసం ఎన్ని అవస్థలు పడుతుందో వివరించిన పద్యాన్ని [2] పరిశీలించినపుడు, ఆనాటి ఉమ్మడి కుటుంబాలలోని పరివారమూ, వారి మధ్య కోడలిగా మసలే స్త్రీ యొక్క అస్వతంత్ర స్థితీ, స్వేచ్ఛ కోసమని ఆమె ప్రక్కదారులు వెతుక్కోవటమూ కళ్ళకు కట్టినట్లు కన్పిస్తుంది.

రాజుల ప్రాపకంలో ఉన్న వేశ్యలు వారి చెట్టిమొట్టి పనులన్నింటినీ ఘన కార్యాలుగా వర్ణించితేనే గాని గడవని పరిస్థితి ఆనాటి సమాజంలో ఉండేది. అందుకే ముద్దుపళని స్త్రీ అయినా కవుల కావ్యాలని మించిన అతివేల శృంగార వర్ణనలతో తన ప్రబంధంలోని స్త్రీని చిత్రించక తప్పలేదు.

అయితే ఈ రాధికా స్వాంతనం కావ్యాన్ని పరామర్శిస్తూ, శ్రీ దేవులపల్లి రామానుజరావు "శృంగార ప్రియులైన రసికులకు అత్యంత ఆహ్లాదకరమైన రచన రాధికా స్వాంతనము"[3]-అన్నారు. "చదివినకొద్దీ చవులూరించే కావ్యం"[4]

---

1. ఆరుద్ర సమగ్రాంధ్రసాహిత్యం, నాయకరాజులయుగం II పేజీ 183.
2. ముద్దుపళని రాధికా స్వాంతనం - 4.81.
3. దేవులపల్లి రామానుజరావు 'సారస్వత నవనీతం' ముద్దుపళని - రాధిక పేజీ 49.
4. ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం, నాయకరాజుల యుగం II పేజీ 176.

అన్నారు ఆరుద్ర. ఆనాడు సాహిత్యంలోని స్త్రీ యొక్క పరిస్థితిని ఈనాటి దాకా (కడు కొద్దిమంది తప్ప) విమర్శకులు ఎవ్వరూ బయట పెట్టలేదు.

పచ్చి శృంగార వర్ణనలనీ, విసుగు కల్గించే ఒక్క లాంటి ఉపమానాలనీ కూడా ఎంతో బాగున్నదంటూ దేవులపల్లి రామానుజరావు గారి లాంటి వాళ్ళ మెచ్చుకోలు దీనికొక ఉదాహరణ కవిత్వంలోనూ, విమర్శనా రంగంలోనూ సామాజిక స్పృహ ఉన్నదని చెప్పుకొంటున్న ఆరుద్రలాంటి విమర్శకులు కూడా సాహిత్యంలో స్త్రీ యొక్క స్థితిని ప్రత్యేకంగా గుర్తించక పోవటమూ, పైగా ఈ కావ్యాన్ని ''చదివిన కొద్దీ చవులూరించే కావ్య''మని కితాబు ఇవ్వటం చూస్తే స్త్రీ విషయంలో ఈనాటికి సాహితీవేత్తల దృష్టిలో మార్పు రాలేదనటానికి దీన్ని మరో నిదర్శనంగా గుర్తించవచ్చు. రాధికా స్వాంతనం కావ్యం చదివిన తర్వాత ఇందులో వర్ణింపబడిన అసభ్య శృంగారం పట్ల వెగటూ, ఆ కాలంలో ఇటువంటి రచనలు చేయవలసివచ్చిన స్త్రీల పట్ల జాలీ కలుగుతాయి. దేవులపల్లి రామానుజ రావు గారన్నట్లు ''ఇది శృంగార ప్రియులైన రసికులకు అత్యంతాహ్లాదాన్ని'' చేకూర్చ వచ్చునేమోగాని సాహిత్యంలో స్త్రీ స్థానంపట్ల ఉత్కృష్టతని కాంక్షించే వాళ్ళకి మాత్రం జుగుప్స కలిగించక మానదు.

ఇటువంటి ప్రబంధాల నభిమానించే పండితులపై శ్రీ గిడుగు రామ్మూర్తి పంతులు చేసిన వ్యాఖ్యానం ఇక్కడ గమనింప దగినది. ''సంస్కృత పద భూయిష్ఠమైన శైలినీ, సంస్కృత సాహిత్య క్షీణయుగంలో తలెత్తి, తెలుగులో చొరబారి పిలక లెన్నోవేసి, తెగ బలిసివున్న క్షుద్ర ''శృంగార'' ఇతివృత్తాలను విపరీతంగా అభిమానిస్తున్న పండితులు, గతైకమతులై జీవిస్తున్నారు''[1] - అంటూ శ్రీ గిడుగు వారు ఆనాడే సూటిగా విమర్శించారు.

నాయక రాజుల కాలంలో యుద్ధాలు, కరువు కాటకాలు, అసమర్థులైన రాజుల పాలన మూలంగా సమాజంలో ఒక అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడింది. స్త్రీలకు సాంఘిక భద్రత కరువైంది. ఆ కాలంలో ఆడపిల్లలకి చాలా చిన్నవయస్సులోనే

1. కె. వి. రమణారెడ్డి "మహోదయము" పేజీ 205.

వివాహం జరిపించేసేవారు. పెళ్ళి జరిగేనాటికి ఆమెకి వివాహాన్ని గురించిన ఆలోచనగాని, ఆ వైవాహిక జీవితంపట్ల అవగాహనగానీ ఉండేవి కావు. ఆమె యుక్తవయస్కురాలైనప్పటికి ఆమె భర్త దాంపత్య సంబధాల పట్ల కొంత విముఖుడు కావటం జరిగేది. దీనితో యవ్వనవంతురాలైన ఆ స్త్రీ మరొక యువకునిపై ఆకర్షణ పెంచుకోవటానికి అవకాశముండేది. పరపురుషుడు ఆ అవకాశాన్ని ఉపయోగించుకునేవాడు. ఇటువంటి సంబంధాలకి సమాజంలో ఇతరుల ఆమోదం ఉండేది కాదు. ఇటువంటి పరిస్థితులలో అవతరించిన ప్రబంధమే సముఖం వేంకట కృష్ణప్ప నాయకుని అహల్యా సంక్రందనము.

ఈ కథలో కూడా మునియైన గౌతమునికి అన్నిరకాల సపర్యలూ చేయటమే తప్ప అందగత్తెయైన అహల్యకు ఆ ముని నుంచి ఎటువంటి ప్రతిస్పందనా ఉండేదికాదు. అతనికి అతని తపోనియమాలు తప్ప ఇతర విషయాలేమీ పట్టేవి కావు. భార్యని కూడా పట్టించుకునేవాడు కాదు.[1] ఆమె కోరికతో అతని పాదాలు పట్టబోయినా, "వృధా దోషమేల మాను" అనేవాడు గౌతముడు. ఆమెకూడా

''త్రిదశాధిపుఁడైతే గద

యద నెఱుగుచుఁ గోర్కెదీర్చు[2]'' నని అనుకుని ఇంద్రుని మీద మనసు పెంచుకుంటుంది. కోరిక తెలుసుకుని ఆనందపరిచేవాడు, అలిగితే బుజ్జగించే వాడు అలాంటి నాయకుడు అదృష్టహీన అయిన తనలాంటి స్త్రీలకెలా దొరుకుతుతారు[3] అని అనుకుంటుంది. అలాంటి నాయకుడైన ఇంద్రునితో కూడి కాపురంచేసే శచి కాపురమే కదా కాపురమంటే[4] - అననుకుంటుంది.

పై భావనలన్నీ ఆ నాటి సామాజిక పరిస్థితిలోని ఒడిదుడుకులకు లోనై మనోవేదనని భరించే ఎందరో స్త్రీల భావనలే. వయసులో ఉండి, చక్కదనంతో

1. అహల్యా సంక్రందనము-సముఖం వేంకట కృష్ణప్పనాయకుడు - 3 - 68, 70.
2. Ibid 3.69.
3. Ibid 2.108.
4. Ibid 2.107.

ఉన్న ఇలాంటి స్త్రీలపై ఇంటిలో వాళ్ళ నిఘా ఎక్కువ. వీళ్ళకి తన బంధువుల నుండి ఏ రకమైన వత్తిడి, అగౌరవమూ కలుగుతాయో కూడా ఈ ప్రబంధంలో చాలా వివరంగా ఉంది. ఇంద్రుని నుంచి రాయబారం నెరపవచ్చిన యోగినితో తన పరిస్థితిని వివరిస్తూ అహల్య ఇలా చెబుతుంది :

సీ. "చక్కని వాడింటి చాయకు వచ్చెనా
మామ గారూరక మండిపడును
పుట్టింటిలో నొక్క పూట యుండఁగ రాదు
కత్తికోతగఁ బోరు నత్తగారు
నిముషంబు పొరుగింట నిలిచియుండగ రాదు
పటుకార్లఁ బట్టును వదినగారు
కడకుఁ బోయిన నొక్క కడ నుండఁగా రాదు
మఱదలు కొండేల మారి బసివి

తే. తోడి కోడంద్రు చూపోపికాడు కొంద్రు
పట్ట పగ పట్టి పోరాడు బావగారు
జార సంగతిఁ గాంక్షించు చంద్రముఖికి
నత్తగారిల్లె కారాగృహంబు దలప"[1]

వీళ్ళందరి కళ్ళుగప్పి పోదామన్నా వీలులేదని, మగడెప్పుడూ తననే గమనిస్తూ ఉంటాడని అహల్య యోగినితో పలుకుతుంది. అందుకే తనకి ఇంద్రునితో పొందెలా కుదురుతుంది అనుకుంటుంది అహల్య.

నిజానికి ఈ పరిస్థితి అహల్యది కాదు. అహల్య మునియైన గౌతముని భార్య. అడవుల్లో ఆశ్రమంలో నివసించేది. ఆమెని మోసంచేసి ఇంద్రుడు, మాయా గౌతముని వేషంతో వచ్చి ఆమెతో రమిస్తాడు. ఈ కథను తీసుకుని కృష్ణప్ప నాయకుడు తన కాలం నాటి సంసార స్త్రీల స్థితికి అన్వయించి రచించాడు. ఈ కథలో అహల్య కూడా పురాణాల్లో పేర్కొన్న అహల్యకాదు.

1. సముఖం వేంకటకృష్ణప్ప నాయకుడు అహల్యా సంక్రందనము - 3.46.

ఈమె ఆ కాలంలో ఇటువంటి పరిస్థితుల నెదుర్కొనే గృహిణులకి ప్రతిబింబము మాత్రమే.

తన స్థితికి తానే జాలిపడుతూ "ధరణి మగనాలికంటెఁ బాతకియుఁ గలదె" ?[1] అని నిందించుకుంటుంది, తనకిలాంటి, రాయబారాలు నెరపవద్దని, తన మానాన తనని బ్రతకనిమ్మని, ఇంద్రుడు పంపిన యోగినితో చెబుతూ అహల్య ఇలా అంటుంది:

"పట్టగ రాని మోహమునఁ బై కొని తోచినవెల్ల బల్కితీ
మట్టునఁ గట్టిపెట్టునిది మానసమందె ధరిత్రి లోపలన్
పుట్టని యట్టి బిడ్డలకుఁ బూసలు గట్టుదురమ్మలక్కలు, లే
గుట్టున నుండుదాన నతి కోపనుఁ డింటి గృహస్థు యోగినీ"[2]

అహల్య పలికిన పై మాటలలో కూడా కారణం లేకుండానే అపనిందలు వేసే అమ్మలక్కలనీ, కోపిష్టియైన ఇంటి యజమానినీ, అతనికి భయపడే భార్యనీ మన కళ్ళముందుంచుతాడు కవి. అహల్య మాటలకు సమాధానంగా ఆ యోగిని, పురాణ కాలంనుండీ ఉన్న ఇటువంటి సంబంధాలు చాలా సహజమైనవేనని చెబుతూ "కాంతకు సమ్మతంబయిన కాంతుని బొందుటె'[3] యొక్క నేరమా - అని ప్రశ్నిస్తుంది. పురుషుని భోగ పరాయణతకు బలికాబడుతున్న స్త్రీ మాత్రం తన కిష్టమైన పురుషునితో ఎందుకు భోగింపకూడదు ? - అనే యోగిని వేసిన ప్రశ్న ఆనాటి కాలానికి విపరీతమైనదే. అయితే ఇది స్త్రీ పరిస్థితిపట్ల సరైన అవగాహనతో కూడుకున్న ఆలోచనలోనుంచి పుట్టలేదు కాబట్టి, దానికి సమాధానం కూడా వారికి స్ఫురించలేదు అందుకే కవి కూడా "వనితల నమ్ముదురె శివశివా! యెంతైనన్"[4] - అనుకుంటాడు.

---

1. సముఖం వేంకటకృష్ణప్ప నాయకుడు అహల్యా సంక్రందనము - 3.52.
2. **Ibid** - 3.57.
3. **Ibid** - 3.39.
4. **Ibid** - 2.106.

ఈ యుగంలోని వాడే అయిన లింగనమఖి తిరు కామయ్య తన సత్యభామా స్వాంతనంలో సత్యభామ యుద్ధానికి వస్తానంటే, వద్దని ఆమెని వారిస్తూన్న శ్రీకృష్ణుని చేత స్త్రీలని మృగాలతో పోలుస్తూ ఇలా పలికిస్తాడు.

> "వెరవక పోరు జూచుటలు, వెన్నెల కుప్పలో కాక గవ్వలో
> గురుగులో బొమ్మరిండ్లో మఱి గుజ్జన గూడులో పెండ్లి వీడులో
> పొరి బొరి నిచ్చలున్ విసరు పువ్వుల రువ్వులో తేట నవ్వులో
> యరయరు కార్యముల్ మృగములట్ల వెలందుల దెల్ప శక్యమే''[1]

ఇదీ స్త్రీలపట్ల ఆనాటి పురుషుల దృక్పథం. కవికూడా పురుషుడే కాబట్టి తనవారి ఆలోచనలకు ప్రాతినిధ్యం వహిస్తూ, వాటిని కావ్యాలలో వ్రాసిపెట్టి పోయాడు.

స్త్రీలు చేసే పనులన్నీ వెన్నెల కుప్పలాడుకోవడం, గవ్వలో, గురుగులో, గుజ్జనగూళ్ళో ఆడుకోవడం, బొమ్మరిళ్ళు కట్టుకోవడంగా పేర్కొన్నాడు కవి. నిజానికి ఆటలన్నీ బాల్యంలో ఆడుకొనేవి. వాటిని యుక్తవయసులోని స్త్రీలకు కూడా ఆపాదించి, ఆవయసులోని స్త్రీల ఆలోచనలని పక్కదారి పట్టించి, వారి ఉత్సాహాన్ని అణగార్చి, తిరిగి వారికి ఏమీరావనీ, తెలియవనీ చెప్పి, వారిని మృగాలతో పోల్చటాన్ని గమనిస్తే ఈ యుగంలో స్త్రీల పట్ల ఎంత చులకన భావముండేదో తెలుస్తుంది.

వీరి చేతిలో కొచ్చేటప్పటికి కృష్ణుడు కూడా సత్యను తలుచుకుని విరహ వేదన పడుతున్నప్పుడు ఉచితానుచితాలు మరచిపోయి పచ్చిబూతులు మాట్లాడుతాడు[2].

అందుకే ఈ కావ్యాన్ని పరామర్శిస్తూ డా॥ నేలటూరి వెంకటరమణయ్యగారు "ఎంతటి ప్రౌఢమైన దైననూ యిట్టి కవిత్వ మేవగింపు పుట్టింపక పోదు"[3] అన్నారు.

---

1. లింగనమఖి తిరుకామయ్య సత్యభామా స్వాంతనం, 2.109.
2. Ibid - 3.39.
3. ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం - నాయకరాజులయుగం II పేజీ 191.

ఇంతకీ ఈ విరహాలు పడటం, క్రీడించాలనుకోవటం, ఇదంతా పురుషులకి మాత్రమే పరిమితం ఇంటిలోని సామాన్య గృహిణి ఇలా ఆలోచించటమే తప్పు. ఇటువంటి విషయాలు మాట్లాడనే కూడదు. కనీసం భర్త దగ్గరైనా సరే స్వతంత్రంగా మెలమాడి, స్వచ్ఛంగా నవ్వగల పరిస్థితి సామాన్య గృహిణులకి లేదు. సంసారంలో భర్తతో భార్యకున్న సంబంధం ఎన్ని ఆంక్షలతో కూడుకుని ఉండేదో చెప్తూ హంసవింశతిలో అయ్యలరాజు నారాయణామాత్యుడు

"కేరగరాదు నవ్వి గిలిగింతలు పెట్టగరాదు చెక్కిలిం
జీరగరాదు గుబ్బలు ఖచిక్కన గ్రుమ్మగరాదు కేళిలో
మీరగరాదు పైకొని రమింపగరాదు గళారవంబు లిం
పారగ సల్పరాదు మదిరాక్షులు భర్తల గూడు వేళలన్"[1]

అని స్పష్టంగా వివరిస్తాడు.

ఈ యుగంలో రాజులకు స్త్రీలే అలంకారాలు చేసేవారట. అభ్యంగన స్నానం దగ్గరనుంచి, అలంకరణ పూర్తి అయ్యేదాకా రాజును స్త్రీ పరివారమే పరివేష్టించి ఉండేది.[2] దక్షిణాంధ్ర నాయకరాజుల యుగం ముందునుంచీ మన కవులు మాత్రం ఇలాంటి ఆగడాలకు శృంగారం వెల్లకొడుతూ వచ్చారు.[3]

అయితే అనంతామాత్యుని భోజరాజీయంలో (క్రీ॥శ॥ 15 వ శతాబ్ది) మాత్రం కవికి స్త్రీ స్థితిపట్ల కొంత సానుభూతి కన్పిస్తుంది. తన కావ్యంలోని గోవ్యాఘ్రి సంవాదం కథలో ఆడిన మాట తప్పితే వచ్చే పాపాలలో స్త్రీలని బాధించే తండ్రులనీ, భర్తలనీ కూడా పేర్కొంటూ, గోవు చేత కవి ఇలా పలికిస్తాడు.

"అర్థాపేక్షఁ గన్నియఁ గొనిపోయి
ముసలికి నిచ్చు తామసుని గతికిఁ

అయ్యలరాజు నారాయణకవి।

1. హంస వింశతి - 1.94
2. రంగాజమ్మ మన్నారు దాసవిలాసం - 2.16
3. K. V. రమణారెడ్డి 'మహోదయం' పేజీ 321.

బాపంబు లేకయే పత్నిఁ బరిత్యజిం
చిన వాని గతికి"[1]

అనంతా మాత్యుని సాక్ష్యం ప్రకారం అతని కాలానికే ఈ కన్యాశుల్కం అనేది స్త్రీని డబ్బు మార్పిడి వస్తువుగా చేసిందని చెప్పవచ్చు

అయితే ఇది తప్పు అనే విషయాన్ని ఇక్కడ కవి సూచిస్తూ, దాన్ని మహా పాపంగా పరిగణిస్తూ, కూతుర్ని డబ్బుకోసమని ముసలివాడికి అంటగట్టే తండ్రినీ, అకారణంగా భార్యను బాధ పెట్టి ఆమెను విడిచిపెట్టేసే భర్తనీ దుర్మార్గులుగా చిత్రిస్తున్నాడు. ఇక్కడ కవికి తన కాలంనాటి సమాజంలో అన్యాయానికి గురౌతున్న స్త్రీలపట్ల సానుభూతి కన్పిస్తుంది.

అయితే రానూ రానూ కవులలో స్త్రీల దుస్థితికి జాలి లేకపోగా ఆమె జీవిత సార్థక్యం అంతా పురుషుని సేవించి తరించటమే అన్న రీతిలో కావ్యాల్లో స్త్రీ చిత్రణ జరిగింది. దీనివలన ఆ కాలంలో స్త్రీ తాలుకు ఆలోచనలు ఎలా ఉండేవో, సమాజంలోని తమ స్థానం గురించి, తమ బ్రతుకుల గురించి ఆనాటి స్త్రీలు ఏమని అనుకునే వారో మనకి తెలియదు. ఆనాటి యుగంలో స్త్రీలే వ్రాసిన కావ్యాలలో సహితం స్త్రీ అంటే పురుషుడు తన కామదాహాన్ని తీర్చుకునే ఒక ఉపకరణంగా మాత్రమే చిత్రించబడింది [2] అనంతర ప్రబంధ యుగం చివరికి వచ్చేసరికి చంద్ర లేఖా విలాపం వంటి బూతుకావ్యాలు, వైజయంతీ విలాసం పేరుతో వచ్చిన ప్రబంధంలో, భక్తి ముసుగేసుకున్న అసభ్య శృంగార వర్ణనలూ కన్పిస్తాయి. అందుకే స్త్రీని దేవతగా ఒక పక్క ఆరాధిస్తూన్నా నిత్యజీవితంలో ఆమెకు ఇవ్వవలసిన స్వాతంత్ర్యంగాని, సముచిత స్థానాన్నిగాని మన పూర్వులు ఇవ్వలేదని[3], ఆరుద్ర లాంటి విమర్శకులు కూడా అంగీకరించవలసి వచ్చింది. రాధికా స్వాంతనం వంటి ప్రబంధాన్ని "చవులూరించే కావ్యంగా" వర్ణించిన ఆరుద్రగారే ఇలాంటి వ్యాఖ్యానం కూడా చేయటం గమనార్హం.

---

1. తెలుగు కావ్యమాల సాహిత్య అకాడమీ. న్యూఢిల్లీ, పేజి 81.
2. రంగాజమ్మ - మన్నారు దాసవిలాసం 1.90.
3. ఆరుద్ర - సమగ్రాంధ్ర సాహిత్యం - నాయక రాజుల యుగం II పేజీ : 112

నాయక రాజుల కాలం దాటి జమీందారుల రోజులు వచ్చినప్పుడు స్త్రీల పరిస్థితి ఎలా ఉండేదో వివరిస్తూ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు, "ఒక జమీందారు ఉన్నాడంటే వాడికి వాడి గ్రామాల్లో ఉండే స్త్రీలందరున్నూ అవసరమైతే భార్యాత్వానికి అంగీకరించవలసిందే. రాజులూ .... రాజ పురుషులూ పూర్వం బకాసురుడు లాగా నిన్న మొన్నటి దాకా సంసార స్త్రీలను బాధించడం వుండేది"[1] అని రాశారు.

అయితే ఈ స్త్రీల సాంఘిక స్థితి మాత్రం జమీందారుల కాలంలో వచ్చిన కావ్యాలలో ప్రతిఫలించలేదు. దానికి ప్రధానమైన కారణం కవుల యొక్క దృక్పథమే దీనినే చాలా స్పష్టంగా వివరించారు, శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ. రాళ్ళపల్లి వారు ప్రబంధ కవులపై చేసిన ఈ వ్యాఖ్యను అందుకే యథాతథంగా ఇక్కడ పొందుపరుస్తాను.

"[2]అప్పటి దృష్టియంతయు మగవారి దృష్టి, తాము తప్ప తక్కిన సృష్టి యంతయు తమ కొఱకై యేర్పడిన దనియే వారు తలఁచినట్లున్నది. వస్త్రాభరణాదుల జతలో స్త్రీని గూడ గణించియుండుట, వారి స్వార్థ పరతకు ప్రథమోదాహరణము. స్త్రీ పురుషునికి భోగ్యవస్తువైనచో, పురుషుడు స్త్రీకి ఏల కాడను చర్చ వారంటించు కోలేదు. ఆఁడది తండ్రికి ఎవఁడో యొకనికి దానమిచ్చి తొలఁగించు కొనవలసిన వస్తువు, మగనికామె భరింపవలసిన దాసి. ఆమె యందలి భోగ్యత తక్కువ కాకుండు వఱకును అతనికి ప్రేమయో కాకున్న మోహమో యుండును. అది యే కారణము చేఁతగాని తగ్గెనా మఱి యొకతెను పెండ్లాడి యో, 'పెట్టుకొని'యో, మొదటియామె నింటిలో వదలి తలుపు తాళములు బిగించును. ఈ స్వాతంత్ర్యము గలవారు గనుకనే, ఆ కాలపు మగవారికి స్త్రీని భోగ్య వస్తువుగా తప్ప నంతకన్న నెక్కువగాఁ జూడవలసిన యక్కఱ యంతగాఁ దోఁప లేదు. కావుననే మన కావ్యములలో చిన్న బాలికను, వృద్ధ స్త్రీలను వర్ణించిన సన్నివేశము

1. కె వి. రమణారెడ్డి మహోదయం - సప్తాశ్వాలు పేజి : 321.
2. రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ 'కావ్యోద్యానము' - రాయల నాటి రసికత వ్యాసం పేజీ : 42-43.

లరుదు. మఱియు స్త్రీలను వర్ణించు సన్నివేశమెట్టిదైనను మన కవుల దృష్టి పడకింటిలో వేచియున్న పెండ్లికొడుకు దృష్టియే కాని వేఱుండదు" — అని వ్రాశారు.

రాళ్ళపల్లివారు ప్రకటించిన పై అభిప్రాయము స్త్రీ పట్ల కవుల దృక్పథాన్ని వెల్లడి చేయటంలో సమగ్రమైనదీ, సమంజసమైనది. స్త్రీల దుఃఖాన్నీ, అవమానాలనీ, స్త్రీలపై జరిగిన బలాత్కారాలనీ కూడా వర్ణనామయంగానే చిత్రించిన ప్రబంధ కవులు స్త్రీని శారీరకంగా మాత్రమే గుర్తించారు. అందుకనే స్త్రీ మనో భావాలలోని సున్నితత్వం ఆమె మనసులోని విభిన్నమైన ఆలోచనారీతులు వారికి అందలేదు.

కథతోనూ, సన్నివేశాల తోనూ సంబంధం లేకుండా ఏ ప్రబంధ రచన అయిన ఒకే రీతిలో కొనసాగింది. ఏ ప్రబంధ నాయికా స్వరూపమైనా అంగాంగ వర్ణనలతో ఒక్కలాగే చిత్రించబడింది. మాటలో, చూపులో, ప్రవర్తనలో ప్రతీ ప్రబంధ నాయికా ఒక్కలాగే ప్రవర్తించేలాగా కవులు పోటా పోటీలతో ఆమె ప్రతీ చేష్టనీ మూసలో పోసినట్లుగా ఒక్కలాగే వర్ణించారు.

## అధ్యాయం - రెండు

# భావ కవిత్వంపై ఇతర ప్రభావాలు

క్రీ॥ శ॥ 19 వ శతాబ్దిలో శ్రీ రాజారామ్మోహన్‌రాయ్ బెంగాల్‌లో మొదటిసారిగా స్త్రీ ప్రాణాన్నే పణంగా పెట్టే సతీసహగమన దురాచారానికి వ్యతిరేకంగా ఒక ఉద్యమాన్ని తీసుకువచ్చాడు. ఆనాటి గవర్నర్ జనరల్ అయిన సర్ విలియం బెంటింక్ యొక్క సహకారంతో సతీసహగమన నిషేధ చట్టాన్ని కూడా తీసుకురాగలిగాడు. రాజారామ్మోహన్ రాయ్‌చే స్థాపించబడిన బ్రహ్మ సమాజం ఆనాడు భారతదేశంలోని ఎందరో యువకులపై తన ప్రభావాన్ని ప్రసరింపజేసింది. ఈ ఉద్యమం హిందూమతంలోని దురాచారాలని సంస్కరించి, హిందూ మతాన్ని పూర్వ వైభవానికి తీసుకెళ్ళాలని తలపెట్టి తన కార్యకలాపాలు కొనసాగించింది.

రాజారామ్మోహన్‌రాయ్ ఇచ్చిన ఉత్తేజాన్ని ఊతగా తీసుకొని ఆంధ్ర దేశంలో శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు సమాజంలో మతంపేరిట స్త్రీకి జరుగుతున్న అన్యాయాలపై ధ్వజమెత్తాడు. దీనికోసం సమాజంలోని వివిధ వర్గాలవారితోనూ సంఘర్షణ పడి తన విద్యార్థుల అండదండలే తనకు బలంగా ఆయన తన ఉద్యమాన్ని కార్యరూపంలో ఉధృతం చేసాడు. బాల్య వివాహాలకు వ్యతిరేకంగాను, వితంతు పునర్వివాహం కోసమూ, స్త్రీ విద్యకోసమూ ఆయన ఆమరణాంతమూ కృషి సల్పాడు.

వీరేశలింగం కాలంనాటికి సాహిత్యం 'పాదు చచ్చే కాలానికి కుక్కమూతి పిందె' లన్న సామెతగా వెర్రితలలు వేసి క్షీణ ప్రబంధయుగంలో ప్రబలిన అసభ్య పోకడలతో మెట్టుమెట్టుగా దిగజారిపోతూ ఉంది. సాహిత్యంలో స్త్రీయొక్క పరిస్థితీ అలాగే పరిణమించింది. తన కాలానికి చాలా దయనీయస్థితిలో ఉన్న

స్త్రీ జనోద్ధరణకోసం ఆయన సాంఘికంగాను, సాహిత్యరంగంలోనూ పోరాటం సాగించాడు.

సమాజంలోని ఉన్నత వర్గాలని ఇది చాలా కలవరపరిస్తే. యువకుల ఆలోచనలకు మాత్రం కొత్తదారి చూపించింది మొదటిసారిగా స్త్రీపట్ల ఒక నూతనమైన సంస్కార భావాన్ని ఏర్పరుచుకోవటానికి యువకులకు వీరేశలింగం పంతులుగారి ఉద్యమమే ప్రేరణ కల్గించింది. ఒకప్రక్క బ్రహ్మసమాజమూ, సంఘసంస్కరణోద్యమమూ యువకులను ఉత్తేజితులు చేసి వారి ఆలోచనలను సంస్కరిస్తూంటే, మరొకప్రక్క కాలేజీలలోని ఆంగ్ల విద్యావిధానం వలన ఆంగ్ల సాహిత్యాన్ని, కవిత్వాన్ని చదివే అవకాశంతో యువకుల సాహితీ దృక్పథంలో కూడా కొత్తభావాలు ఊపిరి పోసుకున్నాయి.

ఆంగ్ల కాల్పనిక కవిత్వంలోని ప్రణయం వీరి దృష్టిని ఎక్కువగా ఆకర్షించింది అంతకుముందు తెలుగు సాహిత్యంలో స్త్రీపురుష సంబంధాలలో లౌకిక శృంగారమే తప్ప ప్రేమ, స్నేహం అనే భావనలేదు ఆంగ్ల కాల్పనిక కవిత్వంలోని ప్రేమ ఆనాటి (19 వ శతాబ్దికి) కాలానికి, సాహిత్యానికీ సరి కొత్తది. కొత్తదానిపట్ల సహజంగా మొగ్గుచూపే స్వభావంతో తొలిసారిగా తెలుగులో భావకవులు ప్రణయాన్ని ప్రధానంగా స్వీకరించారు అప్పటిదాకా సాహిత్యంలో కకావికలైపోయిన శృంగార భావం తిరిగి భావకవులచేతిలో సరి క్రొత్త ప్రేమభావంగా పునర్జన్మించింది. దీనికి కారణమైన ఇంగ్లీషు కాల్పనిక కవిత్వాన్ని, ఆ కవులు చిత్రించిన స్త్రీమూర్తిని క్లుప్తంగా ఇక్కడ పరిశీలిస్తాను.

## ఆంగ్ల కాల్పనిక కవిత్వం [1798 - 1832] :

ఫ్రెంచి విప్లవం యొక్క ప్రభావము; పారిశ్రామిక విప్లవం యొక్క పరిణామము; వాల్టేర్, రూసోల తాత్త్విక బోధనలు కలిసి ఆనాటి ఆంగ్ల కవులపై తమ ప్రభావాన్ని చూపాయి వీటి ప్రేరణతో "స్వేచ్ఛ, సమానత్వము, సౌభ్రాతృత్వము" ప్రాతిపదికగా ఆంగ్ల సాహిత్యంలో ఉద్భవించినదే కాల్పనిక కవిత్వం.

చారిత్రికంగా కాల్పనిక వాదము ఒక ఉద్యమమూ కాదు, ఒక తత్త్వమూ కాదు [1] అయితే ఇది మొదటిసారిగా ఇంగ్లీషులో ఏ అర్థంలో వాడబడినదో చెబుతూ ALBERT 'C' BAUGH " ..First appeared in English in mid 17th Century as a word to describe, the fabulous, extravagant, the fictious and the unreal

కల్పితమైనదీ, అవసరానికి మించి ఊహించినదీ, అవాస్తవికమైనదిగా అభివర్ణితమై కాల్పనిక కవిత్వం 17 వ శతాబ్ది మధ్యకాలంలో మొదటిసారిగా అవతరించింది.

కాల్పనిక కవిత్వం ఎలా ఒక నిర్వచనానికి లొంగదో, కాల్పనిక కవులు కూడా అందరూ ఒక త్రోవలో నడవలేదు. చివరికి ఏ ఒక్క కవీ కూడా తన జీవితంలోను, తన రచనలలోను, చివరిదాకా కాల్పనికతతో సాగలేదు దీని గురించే చెబుతూ ALBERT 'C' BAUGH—

"Romantic phenomena vary in different countries, and even within the same country no two writers are necessarily Romantic in the same way or to the same degree, nor is a writer necessarily Romantic in all his work or through out his life.[3]

---

1. Encyclopaedia Britanica Vol. 19 Page 561.
   Historically Romanticism can be seen to be neither a school, nor a movement. But rather a period of restless, experiment
2. A literary history of England Ed by ALBERT 'C' BAUGH Vol IV, Page 1122.
3. Ibid Page 1122.

కాల్పనిక కవులలో తనకు అందని దానిపై అతి ప్రేమ చూపించటం, ఊహల్లోని వస్తువుకే ప్రాధాన్యత నివ్వటం ఎక్కువగా కనబడుతుంది.[1] కాల్పనిక కవులంతా ఎక్కువగా స్వాప్నికులే. కలలతోను, కలలలోని ప్రతీకలతోను ఈ కాల్పనిక కవిత్వం పరిపుష్టి చెందింది.[2]

కాల్పనిక కవులు వాస్తవ ప్రపంచంలోని వస్తువుని తీసుకున్నా ఆ వాస్తవ స్థితిని, దాని పరిధిని దాటి ఒక ఆదర్శవంతమైన స్థితిని చేరుకుని లౌకికమైన స్పందనతో అలౌకికత్వాన్ని వర్ణిస్తారు. ఈ ద్వివిధ ప్రయోజనాన్ని ఏక కాలంలో సాధించటం కాల్పనిక కవులలోని ప్రత్యేకత.[3]

ఆంగ్ల కాల్పనిక కవులుగా గణన కెక్కిన విలియమ్ వర్డ్స్‌వర్త్, శామ్యూల్ టేలర్ కాలరిడ్జ్, లార్డ్ బైరన్, పి బి. షెల్లీ; జాన్‌కీట్స్‌ల కవిత్వంలోని స్త్రీ చిత్రణని ఇక్కడ పరిశీలిస్తున్నాను.

లిరికల్ బాలడ్స్‌లో "దిమ్మరి యైన స్త్రీ" కథని వర్ణిస్తాడు వర్డ్స్‌వర్త్, **Female Vagrant**[4] అనే గీతంలో. ఇందులో నాయిక ఒక జాలరి బిడ్డ ఆవిడ ఆత్మ కథే ఇది. ఆమె ఆడుతూ పాడుతూ పెరిగింది. ప్రకృతిలో తానూ ఒకటిగా కలిసిపోయింది. ఆమెను తండ్రి ఎంతగానో ప్రేమిస్తాడు. ఎప్పుడూ చదువుతూ తోటలో ఆడుకుంటూ ఉండేది. ఇరవై సంవత్సరాలు ఆనందంగా గడిచిపోయాయి. ఇంతలో వారు ఉండే గుడిసెల మధ్యలో భవనం వెలిసి క్రమంగా అక్కడున్న గుడిసెలన్నింటినీ ఆక్రమించేస్తుంది. ఈ జాలరి స్త్రీ బ్రతుకు కూడా దుర్భరంగా గడుస్తూ ఉంటుంది. ఆమె ప్రేమించిన యువకుడి తండ్రి అతనిని పనికోసమని పట్నం పంపించేస్తాడు. ఆమె అతనికి కన్నీళ్ళతో వీడ్కోలిస్తుంది అటు తర్వాత ఆమెకు వేరే యువకునితో వివాహమైపోతుంది. నాలుగు సంవత్సరాలు గడుస్తాయి.

---

1. A literary history of England Ed by Albert 'C' Baugh Vol. IV page 1122
2. I bid
3. Romantic Imagination - C. M. Bowra page : 291.
4. Lyrical Ballads - 1798 - Oxford University Press page : 69.

ఆమెకు ముగ్గురు పిల్లలు కలుగుతారు. ఆమె తండ్రి మరణిస్తాడు. ఇంతలో కరువు, ప్లేగు వ్యాధి ప్రబలిపోతాయి, అందులో ఆమె భర్తా, పిల్లలూ చనిపోతారు. ఆమె ఒక బ్రిటీష్ నౌక ఎక్కి వెళ్ళిపోతుంది. యుద్ధం జరుగుతూ ఉంటుంది. సైన్యం, బాంబుదాడి, హత్యలు, మానభంగాలు ఇవన్నీ ఆమె మనసుని కలచివేస్తాయి. చివరికి ఆకలితో ప్రకృతిలో కలిసిపోతుంది. కవి ఈ కావ్యానికి ముగింపుగా ఇలా అంటాడు "ఏడుస్తూ ముఖం తిప్పేసుకుంది. బహుశా తన కథ అయిపోయిందేమో, కన్నీరు తప్ప కథ లేదేమో"— అని.

పై కథలో కవి అల్లారుముద్దుగా పెరిగి క్రమేపీ కష్టాల కడలిలో చిక్కుకుని కడతేరిపోయిన ఒక యువతి కథని చాలా జాలిగా చిత్రిస్తాడు. యుద్ధంలో వచ్చిన పరిణామాలని పరోక్షంగా చెబుతూ దానికి బలైపోన యువతి జీవితాన్ని కళ్ళకు కట్టినట్లు చూపిస్తాడు. ప్రేమలో విఫలమైపోయి, తండ్రిని, భర్తని, పిల్లలనీ పోగొట్టుకుంటుంది. ఆకలితో అలమటించిపోయి ఒంటరిగా మిగిలిపోయిన ఆ యువతి యొక్క మానసిక స్థితిని, ఆమె దుఃఖాన్ని వివరంగా వర్ణిస్తాడు కవి.

ఇంకోగేయం "గుడీ బ్లేక్ అండ్ హేరీ జిల్"[1] అనే వాస్తవిక గాథలో, పేదరాలైన వృద్ధ స్త్రీ ఒకామె ఎముకలు కొరికే చలిని భరించలేక ప్రక్కనే ఉన్న హేరీ జిల్ అనే యువకుడి ఇంటి ముందున్న కొన్ని పుల్లలని దొంగిలించి తెచ్చి మంటవేసుకుని చలికాగుతూ ఉంటుంది. ఒకరోజు ఆమె పుల్లలను దొంగిలిస్తూ ఆ యువకునికి పట్టుబడి పోతుంది. ఇక్కడిదాకా వాస్తవంగా చిత్రించాకా కవి అటు తర్వాత దీనిని జానపద గాదగా మలుపు త్రిప్పుతాడు.

ఈ కథలో కూడా కడు వృద్ధురాలు, పేదది అయిన స్త్రీని ఆమె బాధనీ, విధిలేక ఆమె కట్టె పుల్లలని దొంగిలించటం, దొంగతనం చేస్తూ దొరికిపోయి యువకుడు నిలదీసి అడిగితే మౌనంగా నిలిచిపోయిన ఆమె స్థితి పరితల హృదయాలని కలచివేస్తుంది. ఒక వాస్తవిక సంఘటన ఆధారంగా తానీ గేయం రచించినట్లుగా పేర్కొన్నాడు వర్డ్స్ వర్త్.

---

1. **Lyrical Ballads - page :** 85.

మరొక గేయంలో ఒక స్త్రీని తన సోదరిగా భావించి ఆమెకి రాసిన ఉత్తరం లాంటి కవితలో ఆమె స్నేహం కోసం తన హస్తాన్ని చాస్తూ,

**"One moment now may give us more**
**than fifty years of reason**
**Our minds shall drink at every pore**
**the spirit of the season"[1]**

అంటూ వాళ్ళ కలయిక ఎంత విలువైనదో చెబుతున్నాడు.

ముళ్ళపొద (**The Thorn**)[2] అనే గేయంలో ప్రేమించి వంచిపబడిన స్త్రీ గాథని చిత్రిస్తాడు. **Mad mother**[3] అనే గేయంలో తన కొడుకుని చూసుకుని మురిసిపోతూ, ఆ పసిబిడ్డతో తన అనుభూతిని, తన అనుభవాలనీ చెప్పుకుంటూన్న తల్లిని వర్ణిస్తాడు. ఆ పసివాడిపై తన మమతని, అనురాగాన్ని తలుచుకుంటూ ఆ తల్లి పొందే ఆనందాన్నీ ఆవేదననీ హృద్యంగా వర్ణిస్తాడు వర్డ్స్‌వర్త్. ఆమె ఆ పసిబిడ్డతోనే మాట్లాడేస్తూ తనగురించి ఇలా చెప్పుకుంటుంది.

"లోకమంతా నన్ను పిచ్చిదని అంటారు. అయినా నా కానందమే, నువ్వున్నావు నాకు, మీ నాన్నకు నేను భార్యనే. అయినా ఆయనకు నేనంటే పట్టదు. రా బాబూ! పాలు తాగుదువు గాని, నువ్వు పాలు తాగుతూ ఉంటే నాకెంతో హాయిగా వుంటుంది. నా గుండెలో బాధని తీసివేస్తున్నట్లుగా వుంటుంది. భయపడకు బాబూ ! భయపడకు, నీ కోసం ధైర్యంగా సింహంలా నిలబడతాను. నీకు చల్లని నీడ కల్పిస్తాను. నీకు అన్నీ నేర్పిస్తాను''[4]

— ఇలా సాగిపోయే ఈ గేయంలో ఒక మాతృమూర్తి హృదయాన్ని తెరిచి చూపిస్తాడు కవి.

---

1. **Lyrical Ballads - page. 95**
2. **Ibid page : 117**
3. **Ibid page : 141.**
4. **Ibid page : 141.**

"The complaint of a foresaken Indian woman"[1] అనే గేయంలో కవి, ఎకాకిలో ఒంటరిగా తన వాళ్ళంతా తనని వదలి వెళ్ళిపోతే ఉన్న ఆహారాన్ని తోడేలు ఎత్తుకు పోతే, చావుకోసం ఎదురుచూస్తూ, కడసారిగా తన బిడ్డని కళ్ళారా చూసుకుని హాయిగా చచ్చిపోతే చాలని కోరుకునే దీనమైన స్త్రీని చిత్రిస్తాడు.

లూసీ అనే అనాధ స్త్రీని తలుచుకుంటూ కవి వ్రాసుకున్న గీతం ఎండలో వానలో మూడేళ్ళు పెరిగింది[2] ఈ గీతంలో ఆమె జ్ఞాపకాలని తలుచుకుంటూ కవి ఇలా వ్రాసుకుంటాడు.

"ఆవిడ చనిపోతుంది ఎంతో త్వరగా
కాని జ్ఞాపకాలు మిగిల్చి పోతుంది
ఆవిడ అజ్ఞాతంగానే బతికింది
ఎంతమందికి తెలుసు లూసీ గతించిందని ?
కానీ ఆమె తన సమాధిలో ఉంది.[3]

— అంటాడు.

The Solitary Reaper [ఒంటరి రైతుకన్నె] అనే గేయంలో[4], పంట చేలలో, ఒంటరిగా కోతకోస్తూ, కట్లు కడుతూ పాడుకునే ఆమె పాటలోని అర్ధంకాని విషాదాన్నిగురించి కవి ఆలోచిస్తూ ఆ భావమేమిటో తనకెవరైనా చెబుతే బాగుండు ననుకుంటాడు తిరిగి తనకి తనే, బహుశా పాతవీ బాధాకరమైనవీ అయిన గతించిన యుద్ధాల గాథలు కావచ్చు అని అనుకుంటాడు. ఈ కవితలో కవి కాపుకన్నె స్వరమాధుర్యాన్ని, కష్ట జీవనాన్ని ఏకకాలంలో దర్శింప చేస్తాడు.

---

1. Lyrical Ballads page : 191.
2. Types of English poetry page : 378.
   Ed. Kirk & Kirk, Rutgers university.
3. Ibid Page : 378.
4. Ibid Page : 380.

బైరన్ కవిత్వంలో ప్రేయసి నడకని, ఆమెతో విడిపోయినప్పటి ఆ అనుభూతిని ఆ తర్వాత అవి రగిలించిన జ్ఞాపకాలని, ఆమె పైని తన ఆరాధననీ, ప్రేమనీ వర్ణిస్తాడు. నిద్రపోతున్న ప్రేయసిలో పసిపాపని చూస్తూ కవి :

"And the midnight moon is weaving
Her bright chain o'er the deep;
Whose breast is gently heaving
As an infant's asleep"[1] — అని వర్ణిస్తాడు.

## షెల్లీ ప్రేమ తత్త్వం :

"Nothing in the World is single
All things by a law divine
In one spirit meet and mingle
Why not of with thine ?"[2]

—కాలువలన్నీ నదులలో కలుస్తాయి, నదులు సముద్రంలో కలుస్తాయి. ప్రపంచంలో ఒంటరిది ఏదీ లేదు. మరి నువ్వూ నేనూ మాత్రం ఎందుకు కలవకూడదు" అంటూ షెల్లీ నిర్వచించిన ప్రేమ తత్త్వం ప్రేమికులిద్దరి మధ్య కలయికకి ఎంతో ప్రాధాన్యమిస్తోంది. రాయప్రోలు మినహా మిగతా భావ కవులపై ఈ సిద్ధాంత ప్రభావం కన్పిస్తుంది.

## కీట్స్ - ఎండి మియాన్ :

గ్రీకు పురాణగాథ ఆధారంగా వ్రాసిన కావ్యం ఎండిమియాన్.[3] ఇందులో ఎండిమియాన్ అనే గొర్రెల కాపరి నిద్రలో ఒక కలగంటాడు. ఆ కలలో అతనికి

---

1. Types of English Poetry Page : 396 - 397.
2. Ibid Page : 398.
3. Complete Poetical Works by John Keats - Page : 47.

ఒక అపురూప సౌందర్యవతి అయిన స్త్రీ కన్పిస్తుంది. నిద్ర మేల్కొన్నాకా కూడా ఆమె రూపాన్ని అతడు మరచి పోలేక పోతాడు. తన వాధనంతా వెన్నెలతో చెప్పుకుని దుఃఖిస్తాడు. తన కలలో కన్పించిన నాయకిని వర్ణిస్తూ ఎండిమియాన్, ఆమె "బంగారురంగు జుట్టుతో, తెల్లని మెడతో, ముత్యాల్లాంటి చెవులతో మెరిసిపోతోందని, సిగ్గుతో ఎర్రబారిన ఆమె చెక్కిళ్లు, చిరునవ్వులు, చిన్న నిట్టూర్పులు వీటితో ఆమె అందం ఇనుమడించిందని వర్ణిస్తాడు. ఆమె సిగ్గుతో, భయంతో అతని దగ్గరికివచ్చి తాకగానే ఎండిమియాన్‌కి స్పృహ తప్పినంత, మైమరపు కలుగుతుందట.

ఈ సుదీర్ఘమైన గేయంలో కవి ఎండిమియాన్ పాత్ర ద్వారా తన ఊహా ప్రేయసికి రూపం కల్పిస్తాడు. ఇక్కడ ఎండిమియాన్ కవికి ప్రతిబింబమే. ఈ ప్రభావమే ప్రధానంగా అడవి బాపిరాజు 'శశికళ' లో కన్పిస్తుంది

**You say you love**[1] అనే మరొక గేయంలో కవి తన ప్రేయసితో ప్రేమలోని స్వచ్ఛత, వెచ్చదనం, ఆత్మీయత లోపించి కృత్రిమంగా అన్పిస్తే ఎలా ఉంటుందో చెబుతూ అలాకాక తనని నిజంగా ప్రేమించమంటాడు.

ఇలా అంగ్ల కాల్పనిక కవిత్వంలో స్త్రీ సమాజంలోని పలు వర్గాల నుంచీ తీసుకోబడింది. ఆంగ్ల కవులకి కాల్పనిక దృక్పథ మున్నప్పటికీ స్త్రీని చిత్రించేటప్పుడు కేవలం ప్రణయ భావన మాత్రమే లేదు. లిరికల్ బాలడ్స్‌లోని స్త్రీ చిత్రణ దీనికి ఉదాహరణగా పేర్కొన వచ్చు.

లిరికల్ బాలడ్స్ గేయాల్లో ఒక జాలరి యువతి, ఒక వృద్ధురాలు, పిచ్చితల్లి, తప్పిపోయిన లూసీ - ఇలా వయోభేదము, వైవిధ్యమూ రెండూ కన్పిస్తాయి.

అయితే కీట్స్ - ఎండిమియాన్‌లో ఊహాప్రేయసి లేకపోలేదు. కానీ మొత్తం ఆంగ్ల కాల్పనిక కవిత్వం మాత్రం కేవలం ప్రేయసి చుట్టూ మాత్రమే పరిభ్రమించలేదని చెప్పవచ్చు.

---

1. **Complete poetical works of John keats, Page :** 284

## అధ్యాయం - మూడు

# గురజాడ కవిత్వంలో స్త్రీ

ఆంగ్ల కాల్పనిక కవులచే ప్రేరితులై తెలుగు సాహిత్యంలో మూడు దశాబ్దాలపాటు భావకవితా శాఖను విస్తరింపజేసి, ప్రేయసితోను, ప్రణయంతోను, విరహంతోను, వేదనతోను ఖండ కావ్యాలనెన్నో రచించిన భావకవులు తమ ప్రేయసిని ఆయా కావ్యాలలో ప్రత్యేకంగా వర్ణించారు. స్త్రీపట్ల ప్రేమ అనే ఒక కొత్త భావనను చూపించిన భావకవుల రచనలని, వారి కవిత్వంలోని స్త్రీని దర్శించటానికి ముందు, భావకవుల మధ్యలో ఇమడని గురజాడనీ, భావకవితా యుగ ప్రారంభంలోని వాడే అయినప్పటికి కాల్పనికతతో కాక వాస్తవికతతో స్త్రీని చిత్రించిన ఆయన ముత్యాల సరాలని ముందుగా చర్చిస్తాను.

## స్త్రీని సమదృష్టితో చూసిన మొదటి కవి గురజాడ :

నగలు, బంగారము మాత్రమే ప్రేమకు గుర్తని తలచే పాతకాలపుటిల్లాలిలో నిజమైన ప్రేమతత్త్వానికి పాదులువేస్తూ గురజాడ భార్యాభర్తల మధ్య ముందు కాలం కవులు కనీసంగా నైనా ఊహించని స్నేహానికి ప్రాముఖ్యతనిస్తూ ఇలా అంటున్నాడు:

"మగడు వేల్పన పాతమాటది
ప్రాణ మిత్రుడ నీకు"[1]

భార్యాభర్తల సంబంధాన్ని నిర్వచించిన శ్రీనాథుని శృంగార నైషధ కావ్యంలోని భావాన్ని ఇక్కడ గుర్తు చేసుకుంటే గురజాడ ప్రదర్శించిన సంస్కారం ఏమిటో తెలుస్తుంది. దమయంతి తండ్రి ఆమెని నలునితో అత్తవారింటికి పంపిస్తూ ఇలా అంటాడు :

---

1. గురజాడ ముత్యాలసరాలు-కాసులు పేజీ 68.

"భవ్య పతిదేవతాచార పరమ పుణ్య ధర్మ మేమటకుండు మీ"[1] —అని బోధిస్తాడు కూతురికి.

అంతకు ముందుదాకా పతివ్రతాచార పరాయణురాలిగానే తప్ప గౌరవమూ, గుర్తింపూ లేని స్త్రీతో, భర్త తనకుతానే "వేల్పుని కాననీ, తను ఆమెకు ప్రాణ మిత్రుడననీ" పలకటం అంటే, మొట్టమొదటిసారిగా కుటుంబ పరిధిలో స్త్రీకి పురుషునితో సమాన స్థాయి నిచ్చి గౌరవించటమే.

అప్పటిదాకా సాహిత్యంలో భార్య అంటే దాసి లాంటిదే. ఈ అహంకారపు తెరని చీల్చుకుని ఇప్పటికి 75 సం॥ క్రితమే భర్త అనే బంధాన్ని సరికొత్తగా నిర్వచించటం స్త్రీపట్ల గురజాడ సాధించిన విప్లవాత్మకమైన మార్పు. ఇది స్త్రీపట్ల గురజాడ కున్న దృక్పథ మెటువంటిదో చాటి చెబుతోంది.

మరులు గొనటానికీ, నిజమైన స్నేహానికి భేదాన్ని స్పష్టంగా విశదీకరిస్తూ అదే ఖండికలో కవి భార్యతో ఇలా అంటున్నాడు,

> "మరులు ప్రేమని మది దలంచకు
> మరులు మరులును వయసు తోడనె;
> మాయ, మర్మము లేని నేస్తము
> మగువలకు మగవారి కొక్కటె"[2]

పై మాటలలో కూడా స్త్రీ పురుష లిద్దరి మధ్యా అసాధ్యమని సమాజం తలచే స్నేహాన్ని ప్రతిపాదిస్తున్నాడు కవి. స్నేహానికి స్త్రీ పురుష తారతమ్యాలు లేవని చెప్పటం గురజాడ కాలం నాటి సమాజానికి కొరుకుడు పడని భావన.

పూర్వ కావ్యాలలో కవులు మరులుగొనటానికి, కామానికీ, ప్రేమకీ, శృంగారానికీ తేడాని గమనించినట్లు కన్పించదు. ఇక్కడ గురజాడ ప్రేమకీ మరులు గొనటానికీ ఉన్న వైవిధ్యాన్ని చాలా సున్నితంగా వివరిస్తాడు. మరులు

---

1. శ్రీనాథుని శృంగార నైషధం - 7. 9.
2. గురజాడ - ముత్యాల సరాలు - "కాసులు" - పేజీ. 68.

గొనటం వయసుతోనే చెల్లిపోతుందనీ, నిజమైన ప్రేమ అయితే వృద్ధాప్యంలో సహితమూ స్నేహబంధంగా నిలిచిపోతుందని కవి ఇచ్చిన సమాధానంలో ఎంతో సత్యం కన్పిస్తుంది.

గురజాడ స్త్రీని వర్ణించేటప్పుడు చాలా సంస్కారాన్ని కన్పరుస్తారు. ''అరమొగిడ్చిన కన్నుగవనీ, చెదరి యాడెడి ముంగురులని బెదురు యెరగని బింక మొప్పిన బెడగు నడకలనీ"[1] వర్ణిస్తాడు. స్త్రీని వర్ణించేటప్పుడు గురజాడ చేసిన సున్నితమైన వర్ణనలోని తేడాల్ని ఇక్కడ గమనించాలి. అంతకు ముందు ప్రబంధాలలో స్త్రీ నడక ''కుచంబులందురుమ లేనడు మల్లల నాడ'' గా చిత్రింప బడితే గురజాడ చిత్రించిన స్త్రీ "బెదురు యెరగని" విధంగా ఆత్మవిశ్వాసంతో నడుస్తుంది.

అంటరాని మాలకన్యను ముక్తి కాంతగా వర్ణిస్తూ కవి

"ఇహము లోపలి మంచి యంతయు
యిమిడి యున్నది దీని ఆత్మను;
ముక్తి కాంతై తుదకు నీకిది
ముందుగతి చూపున్''[2] — అని అనటంలో గురజాడ స్త్రీ పట్ల తనకున్న ఆదర్శాలను ఆ మాలకన్యలో ఇమడ్చటం కన్పిస్తుంది.

మొదట్లో గురజాడ కూడా పుష్పలావికలపై వర్ణనాత్మకంగా పద్యాలు వ్రాసినా త్వరలోనే తన మార్గాన్ని ఆ ప్రబంధ శైలి నుంచీ సామాజిక వాస్త వికత వైపు మళ్ళించుకొన్నాడు. మరో ఇరవై ఏళ్ళ తర్వాత తను రాసిన ఆ పుష్పలావికల గురించే పాఠ్య గ్రంథ నిర్ణయాధికారిగా రాస్తూ అందులో విద్యా ర్థులు నేర్చుకోదగిందేది లేదని తన పద్యాలపై తానే నిర్మొహమాటంగా విమర్శించు కోగల వ్యక్తి గురజాడ.[3] అందుకే అటుపై ఆయన రచనల్లో ఇటువంటివి కనిపించవు.

---

1. గురజాడ ముత్యాల సరాలు "లవణరాజుకల" పేజీ. 85.
2. గురజాడ ముత్యాల సరాలు - 'లవణ రాజుకల' పేజీ : 91.
3. K. V. రమణారెడ్డి - మహోదయం పేజీ : 123.

తన కాలంనాటి సమాజంలో కన్యాశుల్కం కోసం సంతలో పశువుల్లా అమ్మబడుతున్న బాలికల దుస్థితికి యథార్థ రూపకల్పన చేస్తూ వేదనాభరితంగా ఆలాపించిన గీతం "పూర్ణమ్మ''.

తనని చెరబట్ట ప్రయత్నించిన రాజును నిర్భయంగా ఎదిరించి అతనికి అందకుండా ఆత్మాహుతి చేసుకున్న యువతి "కన్యక''.

గురజాడ చిత్రించిన స్త్రీ మూర్తి ఊహా సుందరి కాదు ప్రణయ దేవత కాదు. అతను సృష్టించిన స్త్రీ పాత్రలలో జీవత్వం ఉంటుంది. వాస్తవికత స్పష్టంగా కన్పిస్తుంది. గురజాడ తన గేయాలలో రూపుదిద్దిన స్త్రీ మూర్తులలో ఒక సంప్రదాయ కుటుంబంలోని గృహిణి ఉంటుంది. మాల మాదిగ కన్యలను వివాహమాడిన నాడు గాని ఈ కులాలు పోవని సంఘ సంస్కారియైన భర్తనే మించిన సంస్కారాన్ని కన్పరుస్తుంది.[1] ఇలా గృహపరిధిలోనే ఉన్నా ఆలోచించ గల గృహిణులని చిత్రించాడు గురజాడ. తన చుట్టూ సమాజంలో అన్యాయాలకి బలౌతున్న బాలికలను తన గేయాలలో వాస్తవికంగా చిత్రించాడు. వీరంతా ఆనాటి సమాజంలో ఉన్న వ్యక్తులే. సమాజంలోని స్త్రీకి తన కావ్యాల్లో చోటు కల్పించక ఊహా ప్రేయసులతో ఊహల గారడీలు చేయలేదు గురజాడ.

తన కాలంనాటి సమాజంలోని స్త్రీ స్థానాన్ని చిత్రించాలని చూసాడుగానీ అసలు సమస్యలే కాని కాల్పనిక సమస్యలను సృష్టించుకుని వేదన పడలేదు. ఆయన పడిన వేదన స్త్రీకి సమాజంలో సరైన న్యాయం జరగటం లేదని. ఈ దృష్ట్యా గురజాడ వాస్తవికతకు కొంచెం ఆదర్శం జోడించిన సంస్కరణ వాదే కాని అటు తర్వాత ఊహా ప్రేయసుల కోసం పలవరించి పోయిన భావకవులకు మార్గ దర్శి మాత్రం కాదు

---

1. కలసి మెసగిన యంత మాత్ర మె
   కలుగ బోదీ యైక మత్యము
   మాల మాదిగ కన్నె నెవతెనొ
   మరులు కొనరాదో ?
   గురజాడ ముత్యాల సరాలు - తోకచుక్క గేయం - పేజీ 61.

ఈ విషయాన్ని తానే స్వయంగా చెప్పుకుంటూ గురజాడ "కవితలో నేను ఉత్తమ ప్రయోజనాలను ఉపలక్షించాను. జీవితాన్ని నూత్న దృక్పథంతో దర్శించి, కథా, కవితా రూపంలో దాని తత్త్వాన్ని అన్వయించడానికి ప్రయత్నించాను. నాకా కళల పట్ల, జీవితం పట్ల కొన్ని ఆదర్శాలు ఉన్నాయి. వాటిని సంస్కృతి పరులు మాత్రం అర్థం చేసుకొని హర్షించగలరు."[1]

కళల పట్ల, జీవితం పట్ల గురజాడ అప్పారావుగారికి ఉన్న ఆదర్శం స్త్రీ పట్ల కూడా ఉంది. అది ఆయనే చెప్పుకున్నట్లుగా ఆయన కవిత్వంలో కన్పిస్తోంది. ప్రత్యేకించి బాధలకు గురౌతున్న స్త్రీలను చిత్రించి గురజాడ, వారి సామాజిక స్థితిని చూపాలని, తద్వారా వారి స్థానాన్ని పైకి తీసుకురావాలని ప్రయత్నించాడు. ఈ రకంగా గురజాడ అప్పారావు వాస్తవికవాదే కాని కాల్పనిక భావకవి మాత్రం కాదు.

---

1. కె.వి. రమణారెడ్డి – మహోదయం పేజీ 255.

## అధ్యాయం - నాలుగు

# భావకావ్యాలు - నాయికా చిత్రణ

స్వదేశీయమైన సంఘ సంస్కరణోద్యమంలోని స్త్రీ పట్ల ఏర్పడిన ఉదార దృక్పథమూ, విదేశీయమైన ఆంగ్ల కాల్పనిక కవిత్వంలోని ప్రణయ భావమూ కలిసి 1910 మొదలుకొని 1940 దాకా తెలుగులోని యువకవులకు ప్రేరణ నిచ్చాయి. దాని ఫలితంగానే తెలుగు కవిత్వంలో "భావకవిత్వము" అనే ఒక కొత్త కవితాశాఖ విస్తరించి, దాదాపు మూడు దశాబ్దాలపాటు ఒక ఉద్యమంగా ప్రబలి, తనదైన ముద్రని ఏర్పరచుకొంది.

మొదట్లో దీనిని నవ్యకవిత్వమని పిలిచేవారు. గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగారు ఆంధ్ర పత్రికలో పదే పదే నూతనంగా బయలుదేరిన ఈ ఉద్యమాన్ని 'భావకవిత్వ'మని పేర్కొనెడివారట.[1] అటు తర్వాత ఈ కవిత్వానికి అదే పిలుపు స్థిరపడి పోయింది.

భావకవిత్వం కూడా ఆంగ్ల కాల్పనిక కవిత్వంలాగే ఒక నిర్వచనానికి లొంగదు. అయితే భావకవిత్వం గురించి కొంత మేరకు నిర్వచించినవారు లేకపోలేదు.

"కవి యొక్క ఒక అవిస్పష్ట వాంఛాకూరము, ఒక అంతర్నిగూఢ తాపము, ఒక చిన్న కావ్యములో ఊదబడినచో"[2] అది భావకవిత్వమవుతుందని అన్నారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.

---

1. "భావకవిత్వంలో నండూరి"-రామమోహన్‌రావు; 1968 నవంబర్ భారతి.
2. "లిరికల్ పొయిట్రీ" - విశ్వనాథ సత్యనారాయణ; 1939 ఆగస్ట్ భారతి.

"భావము యొక్క కవితా స్వభావము"[1] భావకవిత్వమని, కవికొండల వెంకటరావుగారు వ్యాఖ్యానించారు. ఇదే విషయాన్ని బలపరుస్తూ "కవేర్భావః కవిత్వం - భావప్రధానం కవిత్వం భావకవిత్వమ్"[2] - అని శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు వివరించారు

శ్రీశ్రీ కూడా "హృదయాలను, మానసాలను కలవరపరుస్తూ అల్లకల్లో లంగా మూర్ఛిల్లే ప్రమాద ప్రాంతరాలలో కవికి నిరాఘాటంగా విహరించే అధికారం కలదు. అట్టి అతని సంచారాలలో ఏ సన్ముహూర్తాననో కావ్యగీతం ఒకటి మెరుగులు తీరిన విలక్షణ రచనా ధోరణిలో వెలుగు చూస్తుంది. ఆ గీతం కవి అనుభవించిన రసస్థాయిని సమగ్రంగా పాఠకునిలో ఆవిష్కరించగలుగుతుంది. ఉత్కృష్ట భావగీతానికి నా నిర్వచనం ఇది"[3] అంటూ సుదీర్ఘంగా వివరించారు.

ఈ నిర్వచనాలన్నీ గమనిస్తే ఒక విషయం స్పష్టంగా కన్పిస్తుంది. కవ్వితం మారినప్పుడల్లా నిర్వచనాలు మారాయి. కొత్త కవిత్వం వచ్చినపుడు దాన్ని వివరించటానికి కొత్త నిర్వచనాలు అవసరమయ్యాయి.

భావకవిత్వం గురించి పైన చేయబడిన నిర్వచనాలకి ఒక నిర్మాణం ఉంది. ఇవన్నీ భావకవిత్వానికి లక్షణాలయిన అంశాలనన్నింటినీ ప్రాతిపదికగా చేసుకుని తయారైనట్టు తెలుస్తుంది. అందుకే ఈ నిర్వచనాలు కూడా ఆత్మాశ్రయ రీతిలోనే కొనసాగుతాయి.

ప్రధానంగా భావకవులుగా పేరుపొందిన వారంతా క్రీ॥శ. 1891-1900 మధ్యన జన్మించారు.[4] ఆ రోజుల్లో ప్రఖ్యాత భావకవులుగా గుర్తింపబడిన వారు రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, దువ్వూరి రామిరెడ్డి, అబ్బూరి రామకృష్ణారావు, దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి; వేదుల సత్యనారాయణ, నాయని

---

1. ఆధునికాంధ్ర కవిత్వము - సి. నారాయణరెడ్డి పేజీ : 321.
2. Ibid పేజీ : 321.
3, Ibid పేజీ : 322.
4. "నాయని సుబ్బారావు కృతులు - పరిశీలన" అనుమాండ్ల భూమయ్య పేజీ : 1, 2.

సుబ్బారావు, నండూరి సుబ్బారావు, బసవరాజు అప్పారావు, కవికొండల వెంకట రావు, పింగళి - కాటూరి కవులు, వెంకట పార్వతీశ్వర కవులు, తల్లావఝ్ఝల శివ శంకరశాస్త్రి, అడవి బాపిరాజు, మల్లవరపు విశ్వేశ్వరరావు, కాళ్ళకూరి గోపాల రావు మొదలైన వారు.

వీరుకాక ఆ రోజుల్లో వెలువడిన పత్రిక లన్నింటిలో భావగీతాలు వ్రాసి ప్రచురించిన కవులెందరో ఉన్నారు. 1940 లోపల కలము పట్టిన వారంతా భావ కవితా ప్రభావానికి లోనైన వారే.

అయితే పుస్తక రూపంలో వచ్చిన భావకవుల రచనలనే ప్రధానంగా ఇక్కడ పరిశీలిస్తున్నాను.*

భావకవిత్వానికి ఆద్యుడు, అమలిన శృంగార సిద్ధాంత కర్తా, అయిన రాయప్రోలు సుబ్బారావుగారి కవిత్వంలోని స్త్రీమూర్తిని ముందుగా పరిశీలిస్తాను.

## తృణ కంకణం - అమలిన శృంగారం :

ఈ కావ్యంలో నాయిక పదహారు సంవత్సరాల యువతి. ఆమె ఒక యువ కుడిని ప్రేమిస్తుంది. అతడు కూడా ఆమెను అభిమానిస్తాడు. ఆమెనే వివాహ మాడాలని ఎదురు చూస్తాడు. అయితే ఇంతలో ఆమెకు వేరొక పురుషునితో పెళ్ళి జరిగిపోతుంది. ఆ యువకుడు ఆమెనే తలుచుకుంటూ బ్రహ్మచారిగా ఉండిపోతాడు. ఒకరోజు వారిద్దరూ ఊరిబయట తోటలో కలుసుకుంటారు. ఆ నాయిక యువకునితో ప్రేమ మనసుకి సంబంధించినదనీ, పెళ్ళి దానికి పరమావధి కాదనీ, ఇరువురి హృదయాలను అతికే లంకె స్నేహమనీ చెప్పి అతడినీ తిరిగి పెళ్ళి చేసుకోమని కోరుతుంది. ఆమె మాటలకు అతడు మార్పు చెంది, ఆమె మీద మునుపున్న అభి ప్రాయాన్ని మార్చుకుని, ఆమెను సోదరిగా సంభావిస్తూ, ఆమె చేతికి ప్రేమసూచ కంగా తాను అంతకుముందు కట్టిన పట్టు తోరాన్ని తీసివేసి, తృణ కంకణాన్ని

---

* కవుల అనువాదాలు కాక, స్వతంత్ర రచనలను మాత్రమే నా పరిశీలనకు తీసుకొన్నాను. అందుకని రాయప్రోలు సుబ్బారావుగారి లలిత, అనుమితి గురించి ఇక్కడ చర్చించటం లేదు.

తొడిగి, దానిని బాష్ప జలంతో వాడకుండా చూసుకొమ్మని చెబుతాడు తర్వాత వారిద్దరూ ఎవరి త్రోవన వాళ్ళు వెళ్ళి పోతారు. ఇదీ తృణకంకణ కావ్యంలోని ఇతివృత్తం.

ఈ కావ్యంలో నాయికకు పేరు లేదు. ఆమెకు జీవిత తత్త్వాన్ని గురించి వ్యాఖ్యానించగల వయసూలేదు. పదహారు సంవత్సరాల వయసున్న అమ్మాయిలో జీవితం పట్ల నిర్దిష్టమైన అవగాహన నేర్పరచుకో గల మానసిక పరిణితి ఏర్పడే అవకాశం లేదు

అంతకు ముందుదాకా కవిత్వంలో స్త్రీ భోగపదార్థంగా చూపినదానికి విరుద్ధంగా స్త్రీ పట్ల వేరొక దృష్టిని ఏర్పరచాలనే తపనతో కవి వ్రాసిన కావ్యమిది. దీనికి ఆయన పిన్నిగారి భావాలు కూడా తోడయ్యాయి. "ఏ గ్రంథంలో విన్నా ఆడవాళ్ళను గూర్చి ఏమేమో వ్రాస్తారు మగవాళ్ళు"[1] - అని ఆమె వ్యక్తపరిచిన ఆవేదన రాయప్రోలు వారిపై ప్రభావం చూపించింది.

అందుకని అసలు స్త్రీ పురుషుల మధ్య దాంపత్య బంధంలో తప్పించి, స్నేహమే తప్ప శృంగారము ఉండకూడదనే భావన వారిలో కలిగి అది అమలిన శృంగార సిద్ధాంతానికి దారితీసింది.

అప్పటిదాకా కావ్యాలలో స్త్రీ పురుష సంబంధాలన్నీ శారీరక సంయోగాన్ని వర్ణించటమే ప్రధానంగా చేసాయి. స్త్రీ పురుషులిద్దరి మధ్య మరొకలాంటి స్నేహ బంధాన్ని కనీసం ఊహించుకునే అవకాశం కూడా ప్రబంధ కవిత్వం ప్రజలకి ఈయలేదు. ఆ కవిత్వం వలన స్త్రీ అనగానే "సన్నని నడుము, కుచకుంభాలు, జఘనాలు, ఊరువులు అవన్నీ కదిలేలా నడవటం" మాత్రమే గుర్తుకు వచ్చేలాగా స్త్రీ రూపాన్ని చిత్రించాయి. ఈ ప్రభావాన్ని అధిగమించాలనే ప్రయత్నం యొక్క ఫలితమే ఈ అమలిన శృంగార సిద్ధాంతం స్త్రీ పురుషుల మధ్య శారీరక సంయోగాతీతమైన సేహం సాధ్యమేనని నిరూపించాలన్న తపనతో వ్రాసిన కావ్యం తృణకంకణం.

---

1. ఆధునికాంధ్ర కవిత్వము - సి. నారాయణరెడ్డి, పేజీ : 264

అయితే ఈ అమలిన శృంగారంలో కూడా స్త్రీ మనసుకి ప్రాధాన్యత లేదు ఇక్కడ కూడా స్త్రీ హృదయాన్ని సరిగా అంచనా వేయటం జరగలేదు. పరస్పరం ప్రేమించుకున్న ఇద్దరు స్త్రీ పురుషుల హృదయాలలో స్నేహం అంతర్లీనంగా ఉండే ఉంటుంది.

ప్రేమ హృదయ సంబంధి, కోరిక శరీర సంబంధి అంటూ విడదీసి చూడటమే సరైనది కాదు. ఇరువురి ప్రేమికులమధ్యన ప్రేమ వికసించి నప్పుడే వారిరువురి సంయోగము సాధ్యపడుతుంది. గాఢమైన ప్రేమానుభూతిని ప్రకటించు కొనే ఒక సాధనమే స్త్రీ పుంసయోగం. ఇందులో మలినం అనే భావనే అస మంజసం. అలాగే శారీరక సంయోగం లేకుండా ఇరువురు స్త్రీ పురుషులు ప్రేమను నిల్పుకొంటూ స్నేహితులుగా ఉండిపోవటమే పవిత్రమనుకోవటం అవాస్తవికం.

ప్రేమ లేకుండా జరిగే కలయిక శృంగారం క్రిందికి రాదు. అది పశు ప్రవృత్తి అవుతుంది. ఇక ప్రేమికుల మధ్యన శారీరక సంబంధం ఉండవచ్చు; లేక వారు స్నేహితులుగా మిగిలిపోవాలా అన్నది కేవలం వ్యక్తిగతమైన విషయం. ఇటువంటి విషయాన్ని తీసుకొని ఒక సిద్ధాంతంగా తన అభిప్రాయాలని స్థిరపర చటం కోసం తృణ కంకణ కావ్యాన్ని రచించారు రాయప్రోలు వారు. ఈ అమలిన శృంగార సిద్ధాంత స్థాపన కోసం తప్ప తృణ కంకణ కావ్యానికి వేరే ప్రయోజనం లేదు. తృణ కంకణ వావ్యంలో నాయికా నాయకుల కిద్దరికీ మునుపటి ప్రేమ భావం అలాగే ఉంది. ఆమె లేని అతని జీవితం "విడదీసిన రేకుల పూవు చందమై పోయిన మైత్రి"[1]లా ఉందనీ వారిరువురూ కూడా —

"కలిపిన గాటపుం జెలిమి కాంక్షలు పెంచగ
రేల్పవల్ తలంపులను మమేకమైన వలపుల్
కడకుఁ కడగండ్లపాలుగా, కలిసిన జంట"[2]

—లాగానే ఉన్నారింకా అంటూ వర్ణిస్తాడు కవి

1. రాయప్రోలు రచనలు - తృణకంకణము - పేజీ : 61
2. Ibid - పేజీ : 61

నాయకుడు ఆమెను ప్రేమించటం అత్యంత సహజమనీ, ప్రేమించకుండా ఉండటం అసాధ్యమనీ చెబుతూ ఇలా అంటాడు.

"శుక్తి ముత్యాలు పుట్టుట చోద్యమేని
పద్మమున తేనె యూరుట పాపమేని" అని, అలాగే

"మృదువు లయిన అస్మదుదార హృదయముల
ప్రణయ రసోదయ మనుచిత మయిన నగును"[1]

—అంటూ తమ ప్రేమపట్ల చాలా నిశ్చితమైన అభిప్రాయాన్ని వెల్లడించిన ఇతడే

"సరస సాంగత్య సుఖ వికాసముల కన్న
దుస్సహ వియోగ భరమే మధురము సకియ'' !

—అని చెప్పటంలో ఆ పాత్ర స్వభావంలోను, చిత్రీకరణలోను ఏకత ఎక్కడా కన్పించదు. ఇంతగా ఆమెను ప్రేమించిన ఆ యువకుడు, నాయిక అతనితో

"కనుల నొండొరులను చూచుకొనుట కన్న
మనసులవికార ధారణిన్ మనుటకన్న
కొసరి యేమోయి యని పిల్చుకొనుట కన్న
చెలుల కిల మీద నేమి కావలయు సఖుడ !"[2]

—అని చెప్పగానే అతడు ఆమె కోరిక ప్రకారము పట్టుతోరాన్ని తీసి, తృణకంకణాన్ని ఆమె చేతికి తొడిగి బాష్పాంజలితో వాడకుండా చూసుకొమ్మని చెప్పి, ''సోదరీ!" అని సంబోధించటంచూస్తే పాత్ర స్వభావానుగుణంగా కాక కవి కోసం పలికినట్లు అన్పిస్తుంది.

---

1. రాయప్రోలు రచనలు - తృణకంకము - పేజి : 63
2. Ibid - పేజీ : 68

ఆ నాయిక కూడా అతడిని మార్చటం కోసమని బలవంతంగా సిద్ధాంత చర్చలు చేసినట్లు కన్పిస్తుంది ఆమెకు కూడా అతడిపై పూర్వమున్న అనురాగం అలాగే ఉంది. అందుకే అప్పటిదాకా గంభీరంగా అతనికి ప్రబోధం చేసిన ఆమె "కనుల నశ్రువులు నిండగా పలకలేక"[1] తన చేతిని కట్టిన పట్టుతోరాన్ని తీసి వేయమని చెప్పలేక చెబుతుంది. అటు తర్వాత ఆ యువతి—

"గుత్తపు కడియాల కరము సొగసు కన్నులంగవకు
నడ్డముగ పెనంచి కొమ్మ వెన్నూత గాగ ఆ కొమ్మ"[2]

— చెట్టునానుకుని నిలబడి పోవటం, ఆమె మనసులోని విషాదాన్నీ, నిరాశనీ సూచిస్తుంది. నిజానికి స్థిరంగా తన అభిప్రాయాలని వెల్లడించిన ఆ యువతి దుఃఖించ వలసిన అవసరం లేదు. కానీ ఇక్కడ నాయిక బాధపడుతూ చెప్ప టాన్ని గమనిస్తే ఆమెచేత పరిపక్వత చెందని మానసిక స్థితిలో కవి అమలిన శృంగార సిద్ధాంత చర్చలు చేయించటం కన్పిస్తుంది.

దీని గురించి వ్యాఖ్యానిస్తూ శ్రీ జె. వి. రాఘవేంద్రరావు "ప్రణయం గురించి ఇలా రాయడంలో భావకవులు కృతకమైన కాల్పనికమైన ప్రణయాన్ని సృష్టించ గలిగారు. మామూలుజీవితంలో స్త్రీ పురుషులు వొకరు నొకరు ప్రేమించు కున్నప్పుడు వారి మనోభావాలతోపాటు శరీరం కూడా అవిభాజ్య వస్తువుగా ఉంటుంది. శరీర హృదయ ద్వైవిధ్యాన్ని ఆలంబన చేసుకొని ప్రణయ ప్రక్రియ లోని ఒక పాక్షిక సత్యాన్ని సంపూర్ణ సత్యంగా చూపించే కవి ప్రయత్నం అనామోద యోగ్యమే కాదు, అవాంఛనీయం కూడా"[3]—అన్నారు.

ఈ రకంగా అమలిన శృంగార సిద్ధాంతం కాల్పనిక భావజాలంతో సృష్టింపబడ్డ అయోమయమైన సిద్ధాంతంగా కన్పిస్తుంది ఎందుకంటే అమలిన

---

1. రాయప్రోలు రచనలు - తృణకంకణము పేజీ : 68
2. Ibid పేజీ : 69
3. ఆధునిక తెలుగు సాహిత్యంలో - కాల్పనిక వాదం - J V. రాఘవేంద్ర రావు; సాహిత్యపరిషత్తువారి వ్యాస సంకలనం - పేజి : 22

శృంగార సిద్ధాంతాన్ని స్థాపించి దానికోసం తృణకంకణాది కావ్యాలని వ్రాసిన రాయప్రోలు వారే దానికి విరుద్ధమైన సంఘటనలతో కూడిన రూపనవనీత రూపకాన్ని రచించారు ప్రేమించిన వారిరువురి మధ్యనే సంయోగాన్ని నిరాకరించి స్నేహితులుగా బ్రతకమని బోధించిన రాయప్రోలు వారు రూపనవనీతంలో స్నేహితురాలిగా ఉండి తనపై వేరే దృష్టి లేని వకుళమాలికను బలవంతం చేసి అనుభవించిన సుందరుని ప్రవర్తనపై ఏమీ వ్యాఖ్యానం చేయకుండా ఆమె తన ఇష్టానికి వ్యతిరేకంగా తన శీలాన్ని అతనికి దానం చేసి అటుతర్వాత విరాగిలా జీవించిందనీ ఇది గొప్పత్యాగమనీ వర్ణిస్తారు.

తృణకంకణంలో అమలిన శృంగార సిద్ధాంత చర్చచేసిన నాయికకి గాని, రూపనవనీతంలో తన శీలాన్ని దానం చేసినట్టుగా కవి పేర్కొన్న వకుళమాలికకు గాని ఇక్కడ ప్రత్యేకత లేదు. ఎందుకంటే రెండుపాత్రలు కేవలం కవి అభీష్టానుగుణంగా రూపొందాయి కనుక.

స్త్రీ ప్రధాన పాత్రగా రచింపబడిన రాయప్రోలు వారి కవిత్వంలో స్త్రీని అర్థం చేసుకునే ప్రయత్నం ఎక్కడా కన్పించదు. రాయప్రోలు వారి అమలిన శృంగార సిద్ధాంతం దువ్వూరి రామిరెడ్డిగారి 'కడపటి వీడుకోలు'వంటి కావ్యాలలో తన ప్రభావాన్ని చూపించినా అటు తర్వాతి భావకవులు ఎవ్వరూ ఈ సిద్ధాంతాన్ని అనుకరించలేదు. ఇది రాయప్రోలువారితోనే ఆగిపోయింది.

ఒక బలమైన సిద్ధాంతంగా ప్రతిపాదింపబడిన రాయప్రోలు వారి అమలిన శృంగార భావన ఆ రోజుల్లోని సమాజం మీద ఎలాంటి ప్రభావాన్ని చూపించిందో పరిశీలించాల్సి ఉంది. ఆతని తరంలోని ఎక్కువ మంది భావకవుల కవిత్వం మీద మాత్రం ఈ సిద్ధాంతపు ప్రభావం కన్పించదు.

## కష్ట కమల :

వారి పిన్నిద్వారా విన్న ఒక యదార్థ గాధగా రాయప్రోలువారు దీనిని పేర్కొన్నారు. చిన్నప్పట్నుంచి కలిసిమెలిసి తిరిగిన ఇద్దరు బాలబాలికలు, అటు తర్వాత వారి మనసులో ఏర్పడిన అభిప్రాయాల్లోని వైరుధ్యాలు ఇందులోని ప్రధాన ఇతివృత్తం. బాలుడు పై చదువుల కోసమని పల్లె వదిలి వెడతాడు. బాలిక పేరు కమల. ఆమెను ఆ బాలుడి నుంచి ప్రేమిస్తు

నట్లుగా ఉత్తరం అందుతుంది. చిన్ననాటి స్నేహాన్నే ఇంకాజ్ఞాపకం ఉంచు కున్న కమల తనస్నేహితుడు లేఖలో వ్రాసిన ప్రేమభావానికి కలవర పడిపోతుంది. ఆ మరునాడు కలతచెందిన మనసుతో, ఆలోచనలతో సతమతమవుతున్న ఆమె ఊయల ఊగుతున్నప్పుడు ప్రమాదవశాత్తూ క్రిందపడి మరణిస్తుంది. పసితనం పూర్తిగా పోని ఒక బాలికని నాయికగా చిత్రించారు రాయప్రోలు సుబ్బారావుగారు కష్టకమల లో.

## స్నేహలత :

వరకట్న దురాచారానికి ఆహుతైపోయిన ఒక ఆడపిల్ల యదార్థగాధకి అక్షరాకృతి ఈ కావ్యం. బెంగాల్‌లో జరిగిన ఉదంతాన్ని పత్రికలో చదివి ఆ ప్రేరణతో తానీ కావ్యాన్ని రచించినట్లుగా చెప్పుకున్నారు రాయప్రోలు సుబ్బారావు, స్నేహలత కావ్యానికి వ్రాసిన పీఠికలో.

తన పెళ్ళికోసమని ఉన్న ఇంటిని తండ్రి కట్నమివ్వటంకోసం అమ్మేయా లనుకున్నది విని బాధపడి, తనకోసమని తన తల్లిదండ్రులు మిగిలిన తన సోదరులు దారిద్ర్యంతో కష్టాలు పడటం ఇష్టంలేక ఆమె ప్రాణత్యాగాన్ని చేస్తుంది. అదే కారణాన్ని వివరిస్తూ తన తండ్రికి ఉత్తరం వ్రాస్తుంది. స్నేహలత ఖండ కావ్యంలోని ఇతివృత్తం ఇది.

''సుంక మీయక మంగళసూత్రమునకు
యోగ్యరాలు కాదేని నిర్భాగ్యయయిన
కన్య; ఆ జీవితము నేల కాల్పరాదు?" - అని అనుకుని
అగ్నిలోన పూర్ణాహుతి యయ్యె నయ్యె
ధన్యగుణవల్లి స్నేహలతామ తల్లి"[1] - అంటాడు కవి.

స్నేహలత కావ్యం గురించి నారాయణరెడ్డిగారు తన పరిశోధనా వ్యాసంలో వ్యాఖ్యానిస్తూ "సమకాలీనమైన సాంఘిక స్థితిగతులను చిత్రించుచు, వరశుల్క నిరసనము, భారత స్త్రీ ఆత్మోన్నత్యమూ అంగి విషయముగాగల విషాద మధుర కావ్యమిది"[2] - అన్నారు.

---

1. రాయప్రోలు రచనలు - ప్రథమహారము-స్నేహలతలేఖ - పేజీ : 149
2. ఆధునికాంధ్ర కవిత్వము - సి. నారాయణరెడ్డి, పేజీ : 277.

ఒక ఆడపిల్ల పరిస్థితుల ప్రాబల్యాన్ని ఎదిరించలేక, సాంఘిక అసమానతకి గురికాబడి, మరోదారి తెలియక, నిస్సహాయంగా నిప్పంటించుకుని ఆత్మహత్య చేసుకున్న సంఘటన నిజానికి ఎంతో ఆలోచింపవలసిన విషయం. దాన్ని చదివితే బాధ కలుగుతుంది. ఆ దురాచారాన్ని పాటిస్తున్న సాంఘిక నియమాల పట్ల ఆవేశం కలుగుతుంది. కానీ ఆకె చదివితే "విషాద మధురంగా" పాఠకుడెలా అనుభూతి చెందుతాడు?

వరకట్న దురాచారాన్ని వ్యతిరేకిస్తున్నట్లుగా ఈ కావ్యంలో ధ్వనిస్తున్న ప్పటికీ, యదార్థ సంఘటనని చిత్రిస్తున్నప్పుడు వర్ణనలమీదనే మక్కువ ఎక్కువగా కన్పిస్తుంది. సమస్యకి ఈ కావ్యంలో ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడలేదు.

విషాద మధురమైన అనుభూతిని - పాఠకులు కాదుగాని - ఈ కావ్యం వ్రాసినపుడు కవి పొందినట్లుగా అన్పిస్తుంది. లేకపోతే మంటలమధ్య చిక్కుకుని మండిపోతున్న స్నేహలతను కవి వర్ణనాత్మకంగా, సౌందర్యానికి ప్రతీకగా చిత్రించాలని చూడడు. కానీ రాయప్రోలువారు "దహనులో నున్న స్నేహలతామ తల్లి"అనే మకుటంతో మంటల్లో కాలిపోతున్న స్నేహలతను అత్యంత సౌందర్య మయమైన ఉపమానాలతో వర్ణిస్తారు.[1]

మంటల్లో మండిపోతున్న స్నేహలత-

1. "చెంగల్వ పువ్వుల చెరువులో కులికే రాయంచ" లాగా,
2. "తామ్ర పర్ణి నవారుణోదకములో పొదలు తెలియాణి ముత్యాల బొమ్మ" లాగా,
3. "లిఖిత కుంకుమ రంగవల్లికల నడుమ<br>తీర్చినట్టి కర్పూర వేదిక" లాగా,
4. "జ్వలితమైన మహౌషధీ చయనమందు<br>జాలువారు సోమక్షీర సారణి" లాగా,
5. "మంగళా పాసనాగ్ని ధామంబులోన<br>వ్రేలు హైయంగవీన ధారాళి" లాగా,

---

1. రాయప్రోలు రచనలు - స్నేహలత (ప్రథమహారము) పేజీ : 150, 151.

6. "ప్రజ్వలించు జపా రక్త పాదపముల
సందిట ముత్యాలు పూచు కొంది'' లాగా, ఉన్నదట.

7. ''పండు పగడాల రాశిలోఁబడి భ్రమించు
నిండు జాబిల్లి రేక'' లా నిర్మలముగా ఉన్నదట.

ఇక్కడ స్నేహలత మరణించిన సందర్భం అతిదయనీయమైనది. పరిస్థితుల ప్రాబల్యం వలన సమస్యకు సరైన పరిష్కారాన్ని తెలుసుకోలేని వయసులో విధిలేక ఆత్మహత్య చేసుకున్నది ఆమె. స్నేహలత మరణించిన తీరుని వర్ణిస్తూ కవిచెప్పిన ఉపమానాలన్నీ సౌందర్యపూరితాలైనట్టివి. అవి ఈ సందర్భానికి అతకక పోవడమే కాదు, అసహ్యంగా అన్పించి, రాయప్రోలువారికి స్త్రీ ఎడల ఎంతో గౌరవం, ఆదరం ఉన్నాయన్న విమర్శకుల వ్యాఖ్యానంపట్ల అనుమానాన్ని కల్గిస్తున్నాయి.

రాయప్రోలు సుబ్బారావుతో పాటుగా స్నేహానికీ, ప్రేమకూ ఎంతో ప్రాముఖ్యం ఇస్తూ రాసిన ఇతర భావకవుల భావాలలో కూడా ఈ స్నేహం, ప్రేమ, గౌరవం అన్నవి పైకి వేసిన ముసుగుల్లాగే కనిపిస్తాయి. వాళ్ళు అటు పాత భావాలమధ్య ఇటు కొత్త సంస్కారపు ఆలోచనలమధ్య నలిగి, అయోమయంలోపడి, ఒక సమన్వయాన్ని సాధించలేదనిపిస్తుంది. అందుకే వాళ్ళ పద్యాలలో పరస్పర విరుద్ధమైన భావాలు తరుచు కన్పిస్తుంటాయి. ఇది ఎలాగో వచ్చే పేజీలలో వివరిస్తాను.

స్నేహలతాదేవి 15 సంవత్సరముల బాలిక. ఆమెకు వరకట్న సమస్యను, దానికిగల మౌలిక కారణాలను సరిగా అర్థం చేసుకోగల వయసుగాని, జీవితానుభవంగానీ లేవు. తనకోసమని తండ్రి కష్టపడటం ఇష్టంలేని ఆమె మనసులో ఆత్మహత్య చేసుకోవాలనే తలంపుని కలుగజేసినవి గంగాతీరాన ప్రియంవద ఉదాహరించిన స్త్రీల ఆత్మహత్యల గాథలు.[1] ప్రియంవద వివరించిన స్త్రీల కన్నీటి గాథలు స్నేహలత మనసుపై గాఢంగా తమ ప్రభావాన్ని చూపించాయి. ఈ కార

1. రాయప్రోలు రచనలు-స్నేహలత,(ప్రథమహారము) పేజీ : 143, 144.

బాలవలన తన సమస్యకి ఆత్మహత్యనే పరిష్కారంగా స్నేహలత భావించినట్లు తెలుస్తుంది. స్నేహలతాదేవి ఆవిధంగా నిస్సహాయంగా మరణించటం గురించి కవి ఎక్కడా వ్యాఖ్యానించడు. పైగా ఆమెకు నతులర్పిస్తూ ఇలా అంటాడు :


Saraswata Niketan
Acc. No.
Vetapalem.

''ఆర్య కన్యా కులీనత కర్పణముగ
తనువు విడిచి స్నేహలతామ తల్లి
రగుల జేసి పోయిన పరిత్రాణ వహ్ని
ఋషుల యీ భూమి పునరుద్ధరించు గాత''[1]

—కవి పలికిన పై మాటలలో స్నేహలత మరణం పట్ల వ్యతిరేకత ఎక్కడా కన్పించదు.

రాయప్రోలువారు సంప్రదాయ బద్ధుడైన కవి. ఆయనకు ఆర్ష సంప్రదాయాలంటే అనురక్తి ఎక్కువ. ఇది ఆయన ఖండకావ్యాలలో అడుగడుగునా కన్పిస్తుంది. తరచుగా ఆయన ఋక్కులనీ, యజ్ఞవాటికలనీ, ఉపనిషత్సాధననీ, ఋషి ఆశ్రమాలనీ వర్ణిస్తారు. ఆయనకున్న స్త్రీ దృక్పథం కూడా ఈ సాంప్రదాయిక పరిధిలోనిదే.

"జ్వలిత పద మగు నిగమాను వాకములకు
అంది అందని జీవ రహస్య యోగ
బోధలెన్నో సూత్రించిన పుణ్యకన్య
కా వికాస మేమయ్యె జగాన నేడు"[2]

—అన్న రాయప్రోలు వారి మాటలు దీనిని నిరూపిస్తున్నాయి.

## అబ్బూరి రామకృష్ణారావు - మల్లికాంబ :

ఇందులో మల్లిక, కమల అనే ఇద్దరు యువతులు స్నేహితులు. కమల కోరిక మీద ఆమె ప్రేమలేఖలని తన దగ్గర దాచి ఉంచుతుంది

1. రాయప్రోలు రచనలు - స్నేహలత, పేజీ : 132.
2. Ibid పేజీ : 140.

మల్లిక. ఈ విషయాన్ని తన భర్తకు సహితము తెలియనివ్వక ఆమె కమలకు మాట ఇస్తుంది. అయితే ఆ ప్రేమలేఖలని చదివి మల్లిక భర్త ఆమెని అనుమానిస్తాడు. ఆమెని చంపివేయాలని నడిరాత్రి ఆమె మంచాన్ని సమీపిస్తాడు. నిశ్చింతగా నిద్రపోతున్న మల్లిక హఠాత్తుగా మేల్కొని కత్తి పట్టుకుని నిల్చున్న భర్తని చూసి మూర్ఛబోతుంది. ఆమె వక్షస్థలి పై చేయి మోపి భర్త మల్లికను చంపబోయే లోగానే భయకంపితయై, మరణిస్తుంది మల్లికాంబ. చివరికి కమల ద్వారా అసలు విషయం తెలుసుకున్న మల్లికభర్త తను చేసిన పనికి పశ్చాత్తాపంతో కుంగిపోయి ఎటో వెళ్ళిపోతాడు. ఇదీ మల్లికాంబ ఖండకావ్యంలోని ఇతివృత్తం. ఈ కథ ద్వారా మల్లిక పాత్ర పట్ల సానుభూతిని, భర్తల అనుమానాలకు గురయ్యే భార్యల దీనస్థితిని చిత్రించి చివరికి అటువంటి స్త్రీల జీవితాలెలా ముగిసిందీ వివరిస్తారు అబ్బూరి రామకృష్ణారావు గారు.

## దేవులపల్లి కృష్ణశాస్త్రి – ఊర్వశి :

కవి తన గతజీవితం లోని ప్రేమశకలాల నన్నింటిని అతకగా ఆవిర్భవించిన ప్రేయసి ఊర్వశి. ఈ విషయాన్నే చెబుతూ కృష్ణశాస్త్రి ఊర్వశి ఆవిర్భావం ఇలా జరిగిందన్నారు:

"ఇదివరకు నా హృదయము నుంచి అపుడపుడు విరిసిన ప్రేమలేశాలున్నూ, ఇతర హృదయాల నుంచి నా మీద కురిసిన అనురాగ శకలాలున్నూ, జన్మించినదాది నాటి వరకూ నన్ను సోకిన ప్రణయము ప్రతీదిన్నీ సేకరించాను. సేకరించి నా హృదయంలో ఒక్కొక్కటే ఉంచాను. సృష్టి పూర్తయ్యింది. చతుర్దశ భువనాల్లో, సకలాశావకాశాల్లో, ఒక్కతే సౌందర్యైక స్వరూపిణి, ఒక్కతే స్వచ్ఛ సుధా పరిపూర్ణ ప్రణయైక మూర్తి[1]" గా ఊర్వశి జన్మించింది.

ఇక్కడ కవి తన అనుభవాలనాధారంగా చేసుకొన్న ఊహల్లోంచి ఊర్వశి అవతరించిదని చెప్పినప్పటికీ, ఊర్వశి కవికి జీవితంలో చిరపరిచితమైన స్త్రీగా అన్పిస్తుంది. ''మోహినీ హాస మల్లీ ప్రఫుల్ల రుచిలాగా, శ్రీ లలిత వైజయంతీ

1. కృష్ణశాస్త్రి వ్యాసావళి- 2. "మా ప్రణయలేఖంకథ" పేజీ :52, 53.

పరిమళం లాగా, హర జటా పారిజాత లతాంత మధువులాగా, ఒక దివ్య మందార సుమమై''[1] కృష్ణశాస్త్రికి కన్పించింది ఊర్వశి.

''సుఖ స్వప్న దరిద్రమై, నిద్రపోయే వల్లకాడు'' లాంటి అతని బతుకులో ''త్రిజగతీపతి కోటీర దివ్య రత్నరాజినేలు వజ్రాల తురాయి''గా, ఆమె ప్రవేశించింది. కానీ ఆమెలోని విషాదమూర్తి కవి కన్నులని దాటి పోలేక పోయింది. ''ఆమె కన్నులలోని అనంతాంబరపు నీలి నీడల[2]''ని కవి గమనించాడు. ఆ వానకారు మబ్బుల మెయి వన్నె వెనుక దాఁగే బాష్పాలు'' ఆమె నేత్రాలలో అతనికి కన్పించేయి.

అటువంటి ''ఆ అనాథ బాలిక ప్రియురాలు నాకు'' - అంటున్నాడు కవి.

''తమి బిగిసిపోవు ఒక్క సంధ్యావసాన
సాంద్ర కాశ్మీర దృఢ పరిష్వంగ మందు
నిమిడి, నిలువెల్ల ఒదిగి శోషిలిన''[3]

ఆమెను తొలిసారి చూసి కంపించాడు కవి. మరొక రాత్రి,

''కార్మొయిలు పెదవుల ఖండ ఖండములుగ
చిదికి పోయిన కౌముదీ మృదుల కళికఁ''[4]

—లాగా ఉన్న ఆమెని చూసి దుస్సహమైన గాఢ దుఃఖాన్ని ఆపుకోలేక ఏడుస్తాడు కవి.

''క్రొత్తరాక నొడలె యెఱఁగి కొనని గాని
తమకంపుం గౌగిలింత తొందరల నలఁగి
యూపిరాడక మూర్ఛిల్లు నొక్క యలరుఁగని''[5]

---

1. దేవులపల్లి కృష్ణశాస్త్రి కృతులు - ఊర్వశి పేజీ : ౧౧౦
2. Ibid పేజీ : ౧౦౯.
3. Ibid పేజీ : ౧౨౨.
4. Ibid
5. Ibid

కృంగిపోయాడు. అలా తనకు కన్పించిన ఆనాటి విషాద దృశ్యాన్ని తిరిగి తిరిగి గుర్తుచేసుకుంటూ కవి ఇలా అనుకుంటాడు.

"వాడిపోయిన ప్రతి సౌరభమ్ము కొఱకు
బ్రతుకు బ్రతుకెల్ల కరఁగు బాష్పములు కాఁగ
ఎట్లు కననేర్తు నానాఁటి దృశ్యమేను"[1]-అనుకుని విపరీతమైన వ్యధ చెందుతూ-

"దారిఁ దలలెత్తు నింత సౌందర్య లవము
వదలి పోలేరు చంపెడు వఱకు వీరు"[2] - అంటాడు.

ఇక్కడ ఆ స్త్రీని అంతగా హింసించి అనుభవించిన "వారు" ఎవరో పరి తలకు తెలియకపోయినా వారి చేతుల్లోపడి నలిగిపోయిన ఆ స్త్రీమూర్తి మాత్రం కవికి నిజజీవితంలో ఎక్కడో తారసిల్లిన ఒక వంచితురాలిగా అన్పిస్తుంది.

కృష్ణశాస్త్రి ఉద్దేశించిన ఆ స్త్రీ "నిశ్చేష్టితయై, అనలమై దహియించే విషా బాధతో కారుచిచ్చు వేసవి లాంటి గళమెత్తి పాడుటకు"[3] కూడా చేతకాక నిలబడి పోయింది.

"నా కొఱకె చాచు సఖి కంఠనాళమందు
మ్రోఁగక చలించి చెరవడ్డ మూగ బాధ"[4]
-అని కవి రాసినప్పుడు

"అయ్యయో ! ఊర్వశీ విషాదార్ద్రమూర్తి
ఈ నిశీధాన! నా హృదయాన! నిండె
పూర్ణిమా శుభ్రయామిని బొగ్గువోలె"[5]

అంటూ మూర్తీభవించిన శోకమూర్తిలా ఉన్న ఊర్వశి రూపును వర్ణించి నపుడు, ఆమె జీవితంలోని విషాద సంఘటనలు, ఆమె బ్రతుకు కవికి చిరపరి

---

1. దేవులపల్లి కృష్ణశాస్త్రి కృతులు - ఊర్వశి, పేజీ : ౧౨౨.
2. Ibid.
3. Ibid పేజీ : ౧౨౪.
4. Ib.d పేజీ : ౧౩౧.
5. Ibid.

చితమై ఇలా కావ్యంగా రూపుదిద్దుకున్నట్లుగా అన్పిస్తుంది కానీ ఊర్వశి కేవలం కవి ఊహలలో రూపొందిన ఊహాప్రేయసిగా అన్పించదు. ఆమెను తలుచుకోవటంలో కవికి ఒకసారి దుఃఖం; మరొకసారి ఆనందం తెరలు తెరలుగా కన్పిస్తూ ఉంటాయి పాఠకునికి ఒకసారి ఊర్వశిపై జాలి, మరొకసారి ఆమెను స్మరిస్తూ, ఆమెకోసం పలవరించిపోవటంలోని ఆనందం, ఇలా ఊర్వశి పాత్రచిత్రణలోనూ, ఊర్వశి కోసం కవి పడిన తపనలోనూ ఈ వైవిధ్యం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

అయితే కవి ఊర్వశిని కల్పనా మూర్తిగా చిత్రించాలని చాలా ప్రయత్నిస్తాడు.

"ఓరగా ఓరగా నొరుగు నింద్రుని శిరసు
విడిపోయి దిగిపోయి పడినావు నా మ్రోల
వైకుంఠ మృదుకంఠ వైజయంతీ మాల
తెగెనేమొ దిగఁబారు జగములన్నీ దాఁటి
సురభి సౌదామనిగ తరళ మధు ధారగా
ఈశ్వరా లోకమే యిటు వెడలెనో నేడు !"[1]

— అన్నప్పుడు ఆమె పాత్ర చిత్రణలో కాల్పనికత కన్పిస్తుంది. "సుర విలాసవతి"గా ఊర్వశిని సంబోధించి ఆమెను అప్సరాంగనగా చిత్రించాలని కవి ప్రయత్నించటం కన్పిస్తుంది. కానీ,

"మఘవ మస్తక మకుట మాణిక్య రాశిలో
మరుగు హృదయమ్ములో మండు జీవితములో
మాత్ర మూ సమయాన మసకగా మసకగా
మొయిలు కాటుక నీడ ముసురు కొనెనో .. పాపము"[2]

అని వ్రాసి నప్పుడు,

1. దేవులపల్లి కృష్ణశాస్త్రి కృతులు - ఊర్వశి పేజీ : ౦౩౩.
2. దేవులపల్లి కృష్ణశాస్త్రి కృతులు - ఊర్వశి పేజీ : ౦౩౪.

"నరకలోకపు టింట నవయు శోక తమస్సు
వెలుఁగు నమృత మయ్యె ! వీని భాగ్యమ్మయ్యె !"[1]

అని చెప్పి నప్పుడు కవి అప్రయత్నంగా ఆమె జీవితంలోని వాస్తవికతని చూపించినట్లుగా అన్పిస్తుంది.

ఊర్వశి పాల కడలిలో పుట్టిన 'అప్సరాంగన' అని ప్రఖ్యాత కథనం. అటుపై ఆమె నివసించినది కూడా స్వర్గంలో. ఈ "నరక లోకపుచింటిలో శోక తమస్సు"లాగా ఉన్న స్త్రీ సురవిలాసవతియైన ఊర్వశి కాబోదు. ఈమె కవికి అతని జీవితంలో తారసిల్లిన ఒక విషాద స్త్రీమూర్తి కావచ్చు. ఆమెనే ఊర్వశిగా కవి తన కావ్యంలో చిత్రించినట్లుగా అర్థమవుతుంది. అయితే ఊర్వశి తన ఊహా ప్రేయసి అనే భ్రమ కల్గిస్తాడు కవి. తన జీవితంలో తటస్థపడిన విషాద స్త్రీ మూర్తి రూపంలోని, జీవితంలోని వాస్తవికతకి, తన ఊహల్లోని కాల్పనికతనుకూడా జోడించి ఊర్వశిగా తీర్చిదిద్దారు కృష్ణశాస్త్రి.

## వేదుల సత్యనారాయణ శాస్త్రి - దీపావళి :

ఈ కావ్యం కొన్ని ఖండికల సమాహారము. ఈ గేయాలన్నీ వేటికవే సంపూర్ణమైనవి. వీటి మధ్యలో ఏక సూత్రంగా అల్లిన కథ లాంటి దేమీ లేదు. ఇందులోని కొన్ని పద్యాలలో, ఖండికలలో స్త్రీని గురించి, తన ప్రేయసిని గురించిన భావాలను కవి వ్యక్తంచేసాడు. "నిరీక్షణము" అనే ఖండికలో ప్రేయసి యొక్క నిరీక్షణని, "యాత్ర" అనే ఖండికలో ప్రేయసితోడి కవియొక్క జన్మ జన్మాల యాత్రనీ, "నిష్కృతి" అనే ఖండికలో కవికి, అతని ప్రేయసికీ మధ్య గల ప్రేమనీ, "కృతజ్ఞత" అనే ఖండికలో ప్రేయసి ప్రేమ కవిపై కలుగ జేసిన ప్రభావాన్ని, ఇంకా "ప్రతీకారము", "నిరసనము", "ఉత్కంఠ", "ప్రవాసి", "దీపావళి నాఁడు," "ఆహ్వానము" "సముద్రతటాన" "ఆషాఢ మేఘము", "ఆరాధన", "శరదుత్సవము", "కన్నీటిపాట", "అంకితము", "పేద బ్రతుకు", "అభిసారిక", ఇలాంటి కొన్ని ఖండికలలో కవి, తన ప్రేయసినీ, ఆమె ప్రేమనీ, వ్యక్తం చేసాడు.

---

1. దేవులపల్లి కృష్ణశాస్త్రి కృతులు - ఊర్వశి పేజీ : ౧౩౪

## నాయని సుబ్బారావు - సౌభద్రుని ప్రణయ యాత్ర :

కవి చేసిన ప్రణయ యాత్ర అతని ప్రేయసి వత్సలకు అభిముఖంగా సాగటం ఈ గీతాల్లోని ప్రధాన ఇతివృత్తం. నాయని సుబ్బారావుకు మరదలైన వత్సల ఈ కావ్య నాయిక.

''బావ యనుమాట ప్రేమ ప్రపంచానికి నీవు పెట్టిన పేరు'' అని అంటాడు కవి. ఆమె అతనికి మేనమామ కుమార్తె. వారిరువురి అభిమానము చిన్నప్పటి నుంచి పెరిగి, వారి వయసుతోపాటు ప్రాకి, వారి మనసుల నాక్రమించినది.[1] కవి తల్లికి వత్సలను కోడలిగా తెచ్చుకోవాలని ఎంతో కోరిక. కానీ వత్సల తండ్రి తన సోదరికి చేసిన బాసలన్నీ త్రోసిరాజని మేనల్లునికి తన కూతురినివ్వనంటాడు. ఆ వియోగంలో, వత్సల తనకు దక్కదేమో అనే బాధలో కవి ఆలపించినవి ఈ "సౌభద్రుని ప్రణయ యాత్ర''లోని పద్యాలు. ఈ పద్యాలలో కవి వత్సలను ప్రకృతి దేవతలాగా[2] ''స్వర్గధామంలో విస్ఫార దివ్యశోభలడరించు నిర్మల జ్యోతి''గా; అతని ''ఉపాసనాధి దైవతము''గా; అతని ''స్వాంత వీధి కికురించి పోయిన మెఱపుగా"[3] అభివర్ణిస్తారు.

ఏ అనంతకాలం నాటిదీ ప్రణయము అని అనుకుని-

"నీవు జీవనధాత్రివి. నేను జీవిని నీవు లేకున్న నాలేమియే ధ్రువమ్మ్మ"[4] అని అతని ఐశ్వర్యమంతా ఆమెతోనే ఉందని భావిస్తారు.

వత్సలను వివాహమాడిన తరువాత రచించినది "ఫలశృతి". ఆమెను వివాహం చేసుకున్న ఆనందంలో కవి

---

1. నాయని సుబ్బారావు సౌభద్రుని ప్రణయయాత్ర-వత్సలవలపు-పేజీ: 12.
2. **Ibid** స్వప్న ప్రణయము, పేజీ : 37.
3. **Ibid** 'నీవు-నేను' పేజీ : 62, 63.
4. **Ibid**

"ఇమ్మనుజలోక గగనాంచలమ్ము లైన
తగులని త్వదీయ దివ్యపాదములు దేవి !
నా ప్రణయ శృంఖలా సాధనముల చేత
తిగిచి యీ నేలపై సమర్థించినాను"[1]

అని చెప్పుకుంటాడు.

భార్యను రాజ్ఞి గాను, తనను సేవకుని గాను భావించుకుంటాడు కవి.[2] ఆమెని ఉద్దేశిస్తూ కవి "నీవు నిండుకుండవు ప్రేమ భావమందు" - అంటాడు. వత్సలని తన జీవన సర్వస్వముగా చిత్రిస్తారు నాయని తన కావ్యంలో.[3] వత్సల తోడి దాంపత్య జీవనాన్ని వర్ణిస్తున్న కవిలో ఒక మృదువైన భావన అడుగడుగునా మెరుస్తూ ఉంటుంది.

''బాహ్య ప్రపంచ విస్మృతిని దేవి !
ఒదుగుకొని శయనించు నిన్ పొదువుకొని వి
లాస సుందర దివ్యలీలఁ బదునాల్గు
భువనములు బొజ్జలోన నిముడ్చు కొన్న
బాలకృష్ణుని రీతి నే పవ్వళింతు"[4]

—ఇంత సుకుమారమైన భావం శృంగార వర్ణనలో ఇదివరకెక్కడా చోటుచేసుకోలేదు. ఇంత సున్నితమైన భావనతో అదీ ప్రత్యేకించి దాంపత్య సంబంధాన్ని వర్ణించటం అన్నది ఒక్క నాయని వారిలోనే కన్పిస్తుంది. ఫలశ్రుతి చివరి ఖండికలలో నాయికా నాయకులిరువురి స్నిగ్ధానురాగాన్ని ప్రతిఫలింప జేసారు నాయని సుబ్బారావు.

ప్రేమ భావాన్ని వ్యక్తపరిచేటప్పుడు, శృంగార భావాన్ని వర్ణించేటప్పుడు కూడా ఒకేలాంటి సున్నితమైన అనురాగమే నాయని కవిత్వంలో కన్పిస్తుంది. స్త్రీ పట్ల వ్యక్తమయ్యే అభిప్రాయాలలో ఒక మృదుత్వాన్ని సాధించారు నాయనివారు.

---

1. నాయని సుబ్బారావు ఫలశ్రుతి - పేజీ : 114
2. ఫలశ్రుతి - పేజీ : 117.
3. ఫలశ్రుతి - పేజీ : 124.
4. ఫల్శ్రుతి పేజీ : 127

## నండూరి సుబ్బారావు - ఎంకి పాటలు :

కవి యొక్క "గుండె గొంతుకలోన కొట్లాడు"తూ అప్రయత్నంగా ఉదయించిన నాయిక ఎంకి ! అనుకోనివిధంగా అవతరించిన ఎంకి రూపమూ, ఆమె వ్యక్తిత్వమూ ఇవన్నీ కూడా తక్కిన భావకవితా నాయికలకన్నా కాస్త భిన్నంగా మరికాస్త చైతన్య వంతంగా ఉంటాయి. ఆమె ప్రవర్తనలోను ఈ వైవిధ్యం కనిపిస్తుంది.

ఎంకిలో నాయకుడైన నాయుడిబావపై ఇష్టంఉంది. మళ్ళా నాయుడు ఆతి చనువు తీసుకోకుండా చేయగల కట్టుదిట్టమూ ఉంది.

''నా కాసి సూస్తాది నవ్వు నవ్విస్తాది
యెల్లి మాటాడిస్తే యిసిరి కొడతాది,
కన్ను గిలికిస్తాది, నన్ను బులిపిస్తాది,
దగ్గరగ కూకుంటే అగ్గి సూస్తాదీ !''[1]

ఈతరహా స్త్రీపాత్ర చిత్రణ తక్కిన భావకవులకన్నా వేరైనదే.

అలాగని నాయుడంటే ఎంకికి ఇష్టంలేకపోలేదు. ''జడుపు గిడుపూమాని జాముపేతిరిలో సెట్టు పుట్టా దాటి"[2] నాయుడికోసమని మెల్లగా సేనులోకి వెళ్ళగలదు. తీరా వెళ్ళాకా మాత్రం ''యెంతసేపున్నా యిడిసిపెట్టలేని'' నాయుడితో "తగువోళ్ళలో మనకు తలవంపులని[3] హెచ్చరించనూ గలదు.

ఎంకి విరహాన్ని చిత్రించేటప్పుడుకూడా నండూరి వైవిధ్యాన్ని చూపెట్టారు.

---

1. ఎంకిపాటలు - ''ముద్దుల నాయెంకి'' - పేజీ : 2.
2. ఎంకిపాటలు - ''వానలచ్చిమి పాటలో'' - పేజీ : 3.
3. ఎంకిపాటలు - ''యెంకిముచ్చట్లు'' - పేజీ : 4.

''యేటి నురగలకేశి యేటి సూశేవే ?
మావోడి మనసలె మరుగుతాదమ్మా
ఆడునేనిక్కడే ఆడినానమ్మా''[1]

- అని వ్యథ చెందుతుంది ఎంకి. ఎంతకీ రాని నాయుడిని తలుచుకుంటూ,

''నన్నిడిసి పెట్టెల్లి నాడే
నా రాజు
మొన్నె తిరిగొస్తనన్నాడే''[2] — అని ఎదురుచూస్తుంది.

ఎంకి రూపాన్ని వర్ణిస్తూ కవి, ''మెళ్ళో పూసల పేరుతో'' ''తల్లో పూవుల సేరుతో'' ''సెక్కిట సిన్ని మచ్చతో'' ఎప్పుడూ నవ్వుతూ ఉంటుందని చెప్తారు. ఆమె ''రాసోరింటికే రంగు తెచ్చే పిల్ల'' అనీ ఆమె ''కళ్ళెత్తితేనే చాలు కనకాభి సేకాలని'' వర్ణిస్తూ ''ఎంకి వొంటి పిల్ల లేదోయి''[3] - అని నిర్ధారిస్తారు.

ఎంకికి ఒక ఆకృతి నివ్వటం ఇక్కడితో పూర్తయ్యింది. అయితే ఎంకిలో కూడా ముగ్ధత్వాన్ని నండూరివారు చిత్రించకపోలేదు.

''పది మందిలో, 'యెంకి
పాట' నేపాడంగ
గోడ సాటున యెంకి గుటకలేసే యేళ''[4]

—ఈ పాటలో నాయుడు బావని కాసేపు పక్కకునెట్టి నండూరివారు తమ ఊహలతో మన ముందుకొస్తారు. ఇక్కడ 'యెంకి పాట' పాడేది కవిగాను, గోడసాటున పాటవింటూ గుటకలేసే యెంకి ఆయన ప్రేయసిగా అన్పిస్తారు.

''యెజ్జి నా యెంకి'' అనే పాటలో మాత్రం యెంకి కూడా తక్కిన భావ కవితా నాయికల జట్టులో చేరిపోతుంది. ''సిగ్గొచ్చి నవ్వటం, కంట నీరెట్టటం, తెల్ల తెలబోవటం'' - ఇవన్నీ ముగ్ధ, అమాయకురాలు, మృదుమధుర హృదయ

---

1. ఎంకిపాటలు - ''యేటిదరి నా యెంకి'' - పేజీ : 8.
2. ఎంకిపాటలు - ''నా యెంకి'' - పేజీ : 11.
3. ఎంకి పాటలు - ''నమలి మింగిన నా యెంకి'' పేజీ 12.
4. ఎంకి పాటలు - ''యెంకి సూపు'' పేజీ 20.

అయిన భావకవితా స్త్రీ యొక్క ఆభరణాలన్నింటినీ ఈ పాటలో కవి ఎంకికి కూడా అలంకరించటం కన్పిస్తుంది.

''ఉత్తమా యిల్లాలి నోయీ !
నన్నుసురు పెడితే దోసమోయీ !''[1]

—అని అనటంలో ఎంకిని కాపు కన్య నుంచి, కావ్యనాయికల సరసకు ఎదిగేలా వర్ణిస్తున్నారు నండూరి. చివరికి ఇలా వర్ణించి, వర్ణించి[2] నండూరి తన ఎంకిని కూడా దేవతను చేస్తారు.

''యెంకొక్క దేవతై
యెలిసె నంటారు
యింటింట పెడతారు
యెంకి నీ పేరు !''[3]

ఇక ఇక్కడి నుంచి ఎంకి పాత్రచిత్రణలో కాల్పనిక వర్ణన మరీ ఎక్కువగా కన్పిస్తుంది.

"పడవ" అనే పాట దగ్గరకు వచ్చేసరికి నాయుడిబావ క్రమంగా తెర మరుగై పోయి నండూరి వారే నాయకునిగా ముందుకొచ్చి తన ఊహలతో ఎంకిని దర్శించటం మొదలుపెడతారు. అటు తర్వాత ఆయన పాడినవన్నీ "కొత్త పాటలు." ఈ పాటలని నండూరి "నా రవల వెలుగుల పాటలో తల దడుమ కొని తబ్బిబ్బులైన అద్భుతమూర్తికి'' అంటూ అంకితమిచ్చారు. ఈ కొత్త పాటలలో ఎంకి చిత్రణలో ఒక సరికొత్త (పాత పాటలలో కన్పించని) తాత్త్విక భావన చోటు చేసుకుంది.

"యెంకెవ్వరని లోక
మెపుడైన కదిపితే

1. ఎంకి పాటలు - ''ఉత్తమా యిల్లాలు'' పేజీ: 27.
2. ఎంకి పాటలు - ''పంట సేలకే పయనం'' పేజీ: 32.
3. ఎంకి పాటలు - ''సాటేలా ?'' పేజీ: 34.

వెలుగునీడల వైపు
వేలు సూపింతు"[1]
అంటారు కవి.

ఈ కొత్త ఎంకి "సూపుతో మాటాడి, వూపిరితో తెలిగించి, కనుబొమ్మతో నవ్వి"[2] మనసు కరిగిస్తుందిట.

"తెలివి రానీయకే
కల కరిగి పోతాది
ఒక్క నేనే నీకు
పెక్కు నీవులు నాకు"[3] - అంటున్నాడు కవి.

ఈ భావన నాయుడిది కాదు, నండూరి వారిదే అన్పిస్తుంది. ఈ కొత్త యెంకికి "పూల బాసలు, మనసూ" రెండూ తెలుసు. ఈమె పూలతో వియ్యాలు, కయ్యాలూ పెట్టుకుంటూ మానల్లే కవిని ఉంచి తానే పూవై పోయిందిట.[4]

తానే పూవైన యెంకి కవి భావనాప్రపంచానికే పరిమితమైన నాయికగా మారిపోయింది.

"ఈ రేయి నన్నొల్ల నేరవా? రాజా !
ఎన్నెలల సొగసంత యేటిపాలే నటర!"[5]

అని అనగలిగే భావకావ్యనాయిక అయిపోయింది.

చివరికి "కాశీరాణి"[6] అనే పాటలో ఈ ఎంకి యొక్క భాష కూడా మారి పోయింది. ఈ పాటలో ఎంకి పాత పాటల్లోని ఎంకిలా ఉండదు. అప్పటిదాకా స్వేచ్ఛగా తన భావాలని నాయుడితో మురిపెంతో ఒకసారి, కసిరి విసిరికొంటూ

---

1. ఎంకి పాటలు - "వెలుగు నీడలు" పేజీ : 49.
2. ఎంకి పాటలు - "సాము", పేజీ : 50.
3. ఎంకి పాటలు - "తెరచాటు", పేజీ 51.
4. ఎంకి పాటలు - "పూలబాసలు", పేజీ 53.
5. ఎంకి పాటలు - "కలత నిదర", పేజీ 54
6. ఎంకి పాటలు - "కాశీరాణి" పేజీ 58.

మరొకసారి చెప్పి, కవ్వించి, నవ్వించి నాయుడిని తనచుట్టూ తిప్పుకునే కొండ వాగులాంటి ఎంకి

"మనసు నైనా పాద
మంట నీడే నన్ను"[1]

అనగలిగే సాంప్రదాయిక గృహిణిగా మారిపోయింది. పల్లెటూరి పిల్లగా కాక, కవి పూలతో పూజించే "యెంకి రాణి"[2] గా, రూపుదిద్దుకుంది.

"నాగరీకాలు" "పూల యుద్ధము" "సరాగాలు" "రాకపోకలు" అనే పాటల్లో చిత్రింపబడిన ఎంకి పాతపాటల్లోని ఎంకి రూపానికి చాలా దూరమైపోతుంది.

అన్ని పాటల్లోనూ ఎంకి గురించి చెప్పి, చెప్పి ఆమె బాగా పేరు పొందాక ఆమె మీద కవికి కాస్త అసూయ కూడా వేసింది.

"ఏది నే పాడినా
ఎంకి పాటె యనేరు
ఏ పదములో నైనా
ఎంకి కళనె కనేరు"[3]

అని అంటాడు కవి. అయినా "ఈ చిత్తమునకు వెలుగు నీ యెంకి తనమె"[4] అంటూ ఆమె తలపే అతని జీవితానికి వెలుగులాంటిది అని చెప్పుకుంటాడు.

చివరికి ఎంకి వెన్నెల పూల వన్నె చీరదాల్చి

"సిగపూలు, ముంగురులు
చిరు మువల మొల నూలు
ఒక చే సదరు కొనుచు"[5]

---

1. ఎంకి పాటలు - "కాశీరాణి" పేజీ : 58.
2. ఎంకి పాటలు - "యెంకిరాణి" పేజీ : 63.
3. ఎంకి పాటలు - ''ఎంకి కళ'' పేజీ : 77.
4. ఎంకి పాటలు - ''ఎంకితనము'' పేజీ : 89.
5. ఎంకి పాటలు - ''ఉయ్యాల'' పేజీ : 93.

ఒయ్యారముగ ఉయ్యాల లూగుతూ ఉంటే తీగల నడుమ ఊగే ఎంకికి నెలవంక ''దీపమై, తిలకమై, పీఠమై, కిరీటమై" అమరినట్లు కవి వర్ణిస్తాడు. కవి చేతిలో మొట్టమొదటగా రూపుదిద్దుకున్న ఎంకి ఇక్కడ కొచ్చేప్పటికి పూర్తిగా మారిపోయి కన్పిస్తుంది. కవిమీద ఈఎంకి వర్ణన చేస్తున్నప్పుడు పోతన ప్రభావం కన్పిస్తుంది. పోతన భాగవతంలో, వామనావతార ఘట్టంలో "రవి బింబం బుప మింపఁ"[1] అనే పద్య ప్రభావం, అందులోని వర్ణన ఉయ్యాల లూగుతున్న ఎంకిని వర్ణిస్తున్నప్పుడు కన్పిస్తుంది.

ఇలా మొత్తంగా ఎంకి పాత్ర చిత్రణని పరిశీలించినప్పుడు ఎంకి ఉనికి కవి భావావేశం నుంచి, ఊహల వలయాలనుంచీ కన్పిస్తుంది కానీ వాస్తవ ప్రపంచంలో నుంచి కాదు.

## తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి - హృదయేశ్వరి :

తను ప్రేమించిన లక్ష్మిఅనే స్త్రీని తన హృదయేశ్వరిగా సంభావిస్తూ, ఆమెపై ''హృదయేశ్వరి'' పేరుతోనే ఖండకావ్యాన్ని రచించి, దానిని ఆమెకే అంకిత మిచ్చారు కవి. తన ప్రేయసి ప్రతీ చర్యపట్ల కవి స్పందించి దానిని పద్యాలలో పొందుపరిచారు. ప్రేయసిపట్ల కవి వ్యక్తపరచిన భావనలే ఈ కావ్య ఇతివృత్తం.

తన స్నేహితునితో కలసివెడుతూ తొలిసారిగా ఆమెను చూసి ప్రేమిస్తాడు కవి.[2] ఆమెని చూసిన వెంటనే అతని మనసు పక్షిలాగా ఆమె పాదాల చెంత వాలిందంటాడు. ఆమె వీక్షణ కోసం ఎన్నిసార్లో ఆమె సౌధం చుట్టూ ప్రదక్షిణం చేస్తాడు. ఆమెను సరస్వతిగా సంభావించు కుంటాడు. ఆమె యొక్క నిరంతర ధ్యానంతోనే కాలం గడుపుతూ ఉంటాడు. అతని ఊహలలో లక్ష్మి ''తరుణార్క బింబము" గాను, "శీతల జోత్స్న[3]'' గాను దర్శనమిస్తూ ఉంటుంది. 'సాంద్ర సురభిళ చందన చర్చ'గా, 'చారు శీతల తరసుధాసారము'గా అతని హృదయాన్ని చల్లబరుస్తుంది. కవి తన హృదయాన్ని, తన సమస్తాన్నీ ఆమె పాదాలచెంత

1. పోతన శ్రీమదాంధ్ర మహాభాగవతము - 8. 623.
2. తల్లావజ్ఝల; హృదయేశ్వరి - పేజీ : ౧౩.
3. Ibid పేజీ : ౨౪.

అర్పిస్తానంటాడు. ఆమెను ''మధురిమము కన్న మధురమౌ మధురమూర్తి'' గా, భావించు కుంటాడు.

ఆమె గుణగణములు, విద్యాభినిరతి, ఆమె యౌవనంపు నవ్యశోభ అతనికి బౌద్ధుల త్రిరత్నాలులాగా గోచరిస్తాయని అంటాడు. ఆమె ''పాదయుగళి, వదనం నేత్రాలు'' ఇవే తన ధ్యేయమని చెప్పుకుంటాడు. సమస్త ప్రకృతిలోనూ ప్రేయసినే కాంచే కవి తన ప్రేమ విశ్వమంత విశాలమైనదని విశదీకరిస్తాడు. సర్వ ప్రపంచానికి రెండు పక్షాలుంటే ఆమెలేని తనకి మాత్రం కేవలం కృష్ణపక్షమే[1] నంటాడు.

విరహాన వేగిపోతున్న కవి తన ప్రేయసి పొందును కోరుకుంటూ, ఆమె మీద అతనికున్న మొహమాటాన్నీ, సిగ్గునీ పొగొట్టాయని చెబుతాడు [2]

ఇలా ఇవన్నీ కవి యొక్క మనోభావాలే. చివరికి తన ప్రేయసి తనకు దక్కకపోతే కృష్ణలోపడి మరణిద్దామనుకుంటాడు.[3] మరొకసారి ఆమె తన భార్యగా వచ్చి, తనతో కాపురంచేసి సంతానవతియైనట్లుగా ఊహించుకుంటాడు. కానీ వాస్తవంలో అలా జరగటం లేదని బాధపడతాడు. చివరిదాకా ఆమెను పెళ్ళి చేసుకునే ప్రయత్నాలెన్నో చేస్తాడు. తన చెల్లెలి ద్వారా లక్ష్మికి రాయబారం పంపిస్తాడు. కానీ మహరాష్ట్ర జ్యోతిష్కుడొకడు ఆమెతో అతనికి వివాహం జరగదని చెప్పటంతో కవి నిరాశ చెందుతాడు. అతని స్నేహితుడు కవిని ఓదారుస్తాడు. చివరికి లక్ష్మికి తనతో వివాహమైనట్లుగా, ఆమె తన ఇంటికి వచ్చి, తన జీవితాన్ని, మానసాన్ని వెలిగించినట్లుగా ఊహించుకుంటూ కావ్యాన్ని ముగిస్తాడు కవి.

ఈ కావ్యం మొత్తంమీద ప్రేయసిపట్ల కవియొక్క ప్రేమ, అనురాగము, ఆమెను భార్యగా తన జీవితంలోకి ఆహ్వానించాలనుకునే కవి యొక్క కోరికా అడుగడుగునా వ్యక్తమౌతూ ఉంటాయి అయితే లక్ష్మిమాత్రం మౌనముద్రాంకితగా కన్పిస్తుంది. ఆమె పాత్ర కవి భావాల ద్వారానే తప్ప విడిగా కనపించదు.

---

1. తల్లావఝ్ఝల; హృదయేశ్వరి - పేజీ : ౪౮.
2. Ibid పేజీ : ౫౬.
3. Ibid పేజీ : ౬౮.

## అడవి బాపిరాజు - శశికళ :

"బాపిరాజుగారు స్వప్నసీమలలో విహరించి, అపురూప సౌందర్యాలను సందర్శించి ఒక తేజోమూర్తిని తన ప్రేయసిగా, ధ్యేయమూర్తిగా చేసుకుని ఆనందించారు. ఆ తేజోరాశియే శశికళ".[1]

"తప్పటడుగుల కులికి తలుపు దాటిన వయసునుంచీ ఈయన అన్వేషించిన సౌందర్యమే శశికళ"[2] అని చెప్పారు డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు.

బాపిరాజుగారు తన కావ్యాన్ని ఆ శశికళకే అంకితమిస్తూ ఇలా వ్రాసారు.

''నా ఆశయ మూర్తి
నా ఆత్మ పూజా పీఠస్థ
శిల్ప కళాలక్ష్మి
శశికళకే - బాపిరాజు''

శశికళను వివిధ రూపాలుగా దర్శిస్తూ, ఊహించుకుంటూ కవి వ్రాసుకొన్న గేయ సముదాయమే ఈ శశికళా కావ్యం. శశికళ కేవలం కవియొక్క ఊహా ప్రేయసి.

కృష్ణశాస్త్రి తన ఊర్వశిని కూడా ఊహల్లోనే సృష్టించుకొన్నానని చెప్పుకున్నా ఆమెలో ఒక వాస్తవ విరచిత విషాదమూర్తి కన్పిస్తూ ఉంటుంది. కానీ బాపిరాజు శశికళ అలాకాదు. నిజానికి శశికళ యొక్క రూపం కవికే స్పష్టంగా తెలీదు. అందుకే ''ఎవరవే?'' అనే పాటలో ఆమెనే ఇలా అడుగుతాడు.

---

1. బాపిరాజు శశికళకు వ్రాసిన పీఠిక రావులపర్తి భద్రిరాజు పేజీ : ii.
2. "అర్థశతాబ్దపు ఆంధ్రకవిత్వము" - డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి మార్చి, 1963, భారతి.

"ఓ చెలి నీవెవరు ?
కలలోని మాయవా ?''[1] - అని.

కవి యొక్క ఊహ పరుగెత్తినన్ని తోవల్లో, మలుపుల్లో అతని భావనా శక్తి బట్టి, శశికళ ఆయా రూపాల్లో కవికి సాక్షాత్కరించింది. కానీ ఆమె కవి నిజ జీవితంలోని వ్యక్తి కాదు. ఆమె కవి యొక్క సుకుమార భావనా సౌందర్యానికి ప్రతీకగా ఉదయించిన మూర్తి కాబట్టి నిజానికి 'శశికళ' అనే వ్యక్తి లేదు. ఇక్కడ కావ్యంలోని శశికళ కవిగారి ఊహాచిత్రము మాత్రమే. అందుకే ఆమె కోసం కవి పడే తపనలో ఈ అయోమయత్వం కనబడుతుంది. ఆమె అతని "కన్నులు కానని రూపం''. అతని కౌగిలి కందని భావం.[2]

ఆమె అతని ఊహల్లో ఊపిరి పోసుకున్న రూపం. ఆమె కోసం కవి, ''కను తెరచిన కలలమధ్య'', ''కలలెరుగని గాఢ నిద్ర''[3]లో సహితం ఎదురు చూస్తూ, వెతుకుతూ ఉంటాడు. చివరికి వెతికి అలిసిపోయి,

''వెదక లేనే రాణి నిన్నూ
వేదనా పూర్ణమీ బ్రతుకులోనూ !"[4]

—అని పాడుకుంటాడు. ఆమెకోసం కలలుకనకుండా ఉండలేననీ, ఆమె కోసం వెదకి వేసారిన తన హృదయంలో శాంతిలేదనీ, ఆమెకోసమని దిక్కుల్లోకి ఎగిరిపోదామంటే తనకు రెక్కలైనా లేవనీ బాధ పడతాడు. ఆమె కోసమని అతడిటూ అటూ చూస్తే—

''ఎటుల కనినను ఎవరు లేరూ
తీపి బరువుల గీతి మాత్రము
ఓపలేనీ నన్ను ముంచెను''[5]

---

1. బాపిరాజు శశికళ ''ఎవరవే'' పేజీ 8.
2. బాపిరాజు శశికళ ''తెర'' పేజీ 2.
3. శశికళ - ''నిరీక్షణ'' పేజీ : 4.
4. శశికళ - ''అసర్వాత'' పేజీ : 6.
5. శశికళ - ''ఎవరివో ఆ కలస్వనాలు'' పేజీ : 14.

—అని తన కలలే తననెలా గాయపరుస్తున్నాయో చెబుతూ, అవి తన గీతాల్లో వ్యాపించి తననెలా లొంగదీసుకుంటున్నదీ వివరిస్తాడు.

ఆమె అతనిని ఊరిస్తున్నట్లుగా ఊహించుకుంటూ కవి శశికళ "ఒక రాగాలాపనలో, ఒక గీతావిష్కరణలో, ఎవరో ఒక దివ్యరూపగా, తళుకు చానగా, లావణ్యమూర్తిగా దివితరించి, భువి తరించి అతని ప్రణయిని"[1]గా అవతరించిందని చెబుతాడు. ఆమెకోసమని కవి ఒక ప్రత్యేకమైన లోకాన్నే నిర్మిస్తాడు [2] ఆలోకం చంద్రలోకానికి తూర్పుదెసలో సూర్యలోకానికి పశ్చిమంగా ఉన్నదట. ఆ లోకమేలే కన్నెరాణి శశికళే నంటాడు.

శశికళకు నింగి నీలిమవంటి కనుబొమలు, మేఘాలవంటి ముంగురులు ఉంటాయని వర్ణిస్తాడు కవి. శశికళకు విశ్వమూర్తిత్వాన్ని ఆపాదించి ఆమె తన పూజా పీఠాన అధివసించే వేల్పునీ, అమృతమూర్తి అనీ కీర్తిస్తాడు.[3] ఆమెను "సూర్యసుతగా, చంద్రబాల"గా సంభావిస్తాడు. ఆమే గనక తన ఎదుట అవతరిస్తే ఎలా ఉంటుందో ఊహించుకుంటూ కవి,

"జాళువా పాన్పు దిగి
బాల వయ్యారమై
మ్రోల నిలిచితివటే
మోకరిల్లితి నేను"[4]

— అంటూ ఆమెపట్ల తన గాఢానురాగాన్ని వ్యక్త పరుస్తాడు.

శశికళను అమరసఖిగాను, తనను మర్త్యునిగాను ఊహిస్తూ కవి వ్రాసిన పాటలో, అతని ఆ భావనలో కీట్స్ వ్రాసిన ఎండిమియాన్ గేయ ప్రభావం కన్పిస్తుంది. అందుకే కవికి మిత్రుడైన కూడ్లేరిదొర కూడా శశికళను ఊహించు

---

1. శశికళ - "ప్రత్యక్షము" పేజీ : 17, 18.
2. శశికళ - "లోకము" పేజీ : 19.
3. శశికళ - పేజీ : 20.
4. శశికళ - "అవతరణము" పేజీ : 23.

కుంటున్న బాపిరాజుని చిత్రిస్తూ, ఆ చిత్రానికి ''ఎండీమియాన్'' అని పేరు పెట్టారు. బాపిరాజు కూడా ''ఎండీమియాన్'' పేరుతో శశికళ కావ్యంలో ఒక గీతం కూడా రాశారు.

శశికళ అనే పాటలో కవి శశికళను వివిధ రూపాలలో సందర్శిస్తాడు. శశికళను ''దివ్యభాసిత రూపగా, నవ్య సుందరమూర్తిగా, నిత్యయౌవనస్నిగ్ధగా, అతని దేవిగా''[1] చిత్రిస్తారు. శశికళను నగ్నగా ఊహిస్తూ కవి ఒక గీతాన్ని వ్రాస్తూ, ఆమె సౌందర్యాన్ని వర్ణిస్తూ, ఆమె సౌందర్యానికి అతని కనులు మిరుమిట్లు గొలిపాయని, అతని హృదయము ఉద్రిక్తమైందని[2] పేర్కొంటారు. ఈ పాటలో శశికళను అంగాంగ సౌందర్యంతో, ప్రఖ్యాత, కవి సమయాలతో వర్ణిస్తారు బాపిరాజు.

తన ప్రేమకు పరమార్థం శశికళ రూప చిత్రణేనని కవిచెప్పుకున్నాడు. ఆమెను తనలోని చైతన్యగా భావిస్తూ, ఆమె ''అనన్య'' అంటాడు ఇంకో పాటలో. కవి తనని ధీరలలితునిగాను, శశికళను స్వాధీన పతికగాను[3], ఊహించుకొంటాడు. సాంప్రదాయికమైన భావన ఇతర భావకవులందరి లోనూ ఉన్నట్లే బాపిరాజు లోనూ ఉంది.

కవి తన ప్రణయమే శశికళ యొక్క రూపుగా, తన ప్రజ్ఞే ఆమె లోకముగా, తన యొక్క ఆత్మయే ఆమె ప్రాణంగా[4] చెప్పి, ''నీకు నాకు విడుటేది, విరహమేది?'' —అంటాడు.

కవి తన ఊహా ప్రేయసికోసం వెర్రిగా అన్వేషించటమే ఈ కావ్యమంతా నిండి ఉంది.

---

1. బాపిరాజు శశికళ - "శశికళ" పేజీ : 29.
2. బాపిరాజు శశికళ - "నగ్న" పేజీ : 30, 31, 32.
3. బాపిరాజు శశికళ - "నాట్యము" పేజీ : 57.
4. బాపిరాజు శశికళ - ''ధ్యేయము'' పేజీ : 77.

## బసవరాజు అప్పారావు గేయాలు :

"వలపెఱుంగక బ్రతికి
కులికి మురిసే కన్న
వలచి విఫల మ్మొంది
విలపింప మేలురా"[1]

అంటూ బసవరాజు అప్పారావుగారు సరికొత్త ప్రేమతత్వాన్ని స్థాపించి, అంతకు ముందు రాయప్రోలు సుబ్బారావు నెలకొల్పిన అమలిన శృంగార సిద్ధాంతానికి వ్యతిరేకమైన రీతిలో ప్రేమకన్నా యెక్కువ ఏమీలేదని, చెలి వలపు లేని కలిమి వ్యర్థమనీ నిర్వచిస్తారు.

ఈ సిద్ధాంతానికి అనుగుణంగానే బసవరాజువారు తన గీతాలలో ప్రేయసి ఎడల ప్రేమని వ్యక్తపరుస్తారు. ఈయన గేయాలలో కూడా ప్రత్యేకమైన కథ గానీ, పాత్రగానీ లేవు. కవి తన అభిప్రాయాలని గేయాలుగా మార్చటం కనిపిస్తుంది.

## కవి కొండల వెంకటరావు గీతాలు :

కవికొండల వెంకటరావు గారు రచించిన వివిధ గీతాల సంపుటి ఇది. ఈ గీతాలలో శృంగార వర్ణనలలో విశృంఖలత, కాముకత పరవళ్ళు తొక్కుతూ ఉంటాయి.

భావ కవులలో స్త్రీపట్ల వ్యక్తమయ్యే గౌరవభావం వీరి గీతాలలో కన్పించదు. స్త్రీని అంగ సౌందర్యంతో కొలిచిన పాటలు ఈ పుస్తకంలో ఎక్కువ. వీరు చూపిన స్త్రీని వచ్చే ప్రకరణంలో వివరిస్తాను.

## మల్లవరపు విశ్వేశ్వరరావు - మధుకీల :

భావనాలోకంలో, ఊహల ఊసులలో, గాలిమేడల్లో కవి తనప్రేయసికోసం వెతుక్కుంటూ రాసినపాటలు మధుకీల కావ్యంగా అవతరించాయి.

---

1. బసవరాజు అప్పారావు గేయాలు - పేజీ : 1.

ముగ్ధ, అమాయకురాలు, సిగ్గులప్రోవు అయిన నాయికకోసం కవి పలవ రించటం కన్పిస్తుంది ఈ పాటలలో.

"సగము వెన్నెల సగము చీకటి
నిదురలోనే కదులు స్వప్నము
నీడలో దాగున్న పుష్పము,
నీ స్వరూప మదృశ్య ప్రేయసీ"[1]

— అంటూ శశికళకు మరొక చెల్లెలిని సృష్టించారు మల్లవరపు విశ్వేశ్వర రావు.* వీరి ఊహా ప్రేయసి, ''తెలి మబ్బుల వలువలతో, తారామణి హారంతో, వసివాడని వలపులతో విరిసి వలచి వచ్చె అచ్చర''[2] కనిపించని ఆ అదృశ్య ప్రేయసికోసం కవి లోకలోకాలలో గాలిస్తాడు.

## కళ్యాణ కింకిణి :

మల్లవరపు విశ్వేశ్వరరావు గారు వ్రాసిన మరో గేయసంపుటి ఈ కళ్యాణ కింకిణి. దీనికి వ్రాసిన పీఠికలో శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి,

"మామూలు మానవులవలె తనకి దొరికిన దానితో తృప్తి పడక తీరని కోరికతో, ఏదో ఉన్నతాశయముతో, తనకు కావలసిన సౌందర్యం కోసమని కవి- ఒక ప్రపంచాన్ని సృష్టించు కుంటాడని, ఆ ప్రపంచానికి అధిదేవత స్త్రీయని, ఆమె కామతృప్తికి ఆధారమయ్యే వ్యక్తి కాదని, ప్రేమ స్వరూపిణి అనీ మల్ల వరపు వారి కళ్యాణ కింకిణిలోని స్త్రీ ఈ ఆదర్శానికి ప్రతిబింబమని, ఈ ఆదర్శం కోసం సలిపిన అన్వేషణే మధుకీల అనీ, దాని ఫలశృతి కళ్యాణ కింకిణి" అనీ వ్రాసారు.

కళ్యాణి కింకిణి లోని స్త్రీ కూడా "తారా కోమలాంగి, తేజ స్నిగ్ధదేహ". ఈమె ఎవరో తెలియక పోయినా కవి తన ప్రేయసిని ''నవ నిత్య యౌవనానంద

---

1. మల్లవరపు విశ్వేశ్వరరావు; మధుకీల-''అదృశ్య''అనే గేయం. పేజీ : ౬౦.
2. మల్లవరపు విశ్వేరరావు; మధుకీల-"ప్రతిఫలము"అనే గేయం. పేజీ:౦౯౯.
* ఇలాంటి భావాలతో వ్రాసిన గేయం ఒకటి ఆంధ్ర భారతి 1927 ఏప్రిల్ సంచికలో వచ్చింది. గేయంపేరు 'భ్రాంతి' రచయిత. జి. నారాయణమూర్తి.

ప్రాణి" గా పేర్కొంటాడు. ఆమెను కవి "ఇంద్ర జాలిక"గాను, ''మోహిత వని" గాను భావిస్తూ తన గీతాలలో చిత్రిస్తాడు.

## కాళ్ళకూరి గోపాలరావు - స్నాన ఘట్టము :

ఈ ''అభినవ భావకావ్యం"లో, కవి స్నానం చేస్తున్న స్త్రీ సౌందర్యాన్ని నాయికగాను, ఆమె అందాలని చూస్తున్న పురుషుల నయనాలను నాయకుని గాను చిత్రించారు. కవి తన ఈ కావ్యాన్ని ''అభినవ భావకావ్య"మని పేర్కొన్నారు. ప్రబంధాలలోని స్త్రీ అంగాంగ వర్ణనలతో సరితూగే విధంగా కవి ఈ కావ్యంలో స్త్రీని వర్ణిస్తారు. కామ దృక్పథంతో స్త్రీ సౌందర్యాన్ని చిత్రించిన కావ్యం ఈ కాళ్ళకూరి గోపాలరాయ కవి గారి స్నాన ఘట్టము.

---

ఇప్పటి దాకా వివరించిన భావ కావ్యాలు మాత్రమే కాకుండా, ఇంకా విశ్వనాథ సత్యనారాయణ గారి 'కిన్నెరసాని పాటలు', 'గిరి కుమారుని ప్రేమ గీతాలు', నాయని సుబ్బారావుగారి 'మాతృ గీతాలు', దువ్వూరి రామిరెడ్డిగారి 'నలజారమ్మ అగ్నిప్రవేశం', 'జలదాంగన', 'వనకుమారి', 'యువక స్వప్నం', వేంకటపార్వతీశ్వర కవుల 'ఏకాంతసేవ', పింగళి-కాటూరి కవుల 'సౌందర నందము', రాయప్రోలు 'స్వప్న కుమారము' వంటి భావ కావ్యాలు కూడా ఉన్నాయి.

కిన్నెర వాగుని నాయికను చేసి విశ్వనాథ వారు వ్రాసిన పాటలు 'కిన్నెరసాని పాటలు'. 'గిరికుమారుని ప్రేమ గీతాలు', వరలక్ష్మి త్రిశతి విశ్వనాథ వారు తన భార్యపై ప్రేమతో వ్రాసిన కావ్యాలు. 'వరలక్ష్మి త్రిశతి' లో భార్య మరణంపట్ల కవి వ్యక్త పరచిన దుఃఖం ఇమిడి ఉంది. నాయని సుబ్బారావు గారి 'మాతృ గీతాలు' మృతి చెందిన తల్లి యొక్క జ్ఞాపకాలని స్మరించుకుంటూ కవి వ్రాసిన పద్యాలు. పింగళి - కాటూరి కవుల 'సౌందరనందము' బుద్ధుని కాలానికి చెందిన సుందరీ నందుల ప్రేమ వృత్తాంతం. కథలో ఇమిడి వర్ణింపబడినవే గాని, ప్రత్యేకించిన స్త్రీ పాత్రలు ఈ కావ్యాలలో లేకపోవటం వలన ఈ కావ్యాలని ఇక్కడ ప్రత్యేకించి పరిశీలించలేదు. అయితే ఈ కవుల స్త్రీ దృక్పథాన్ని మాత్రం వచ్చే పరికరణం 'భావ కవిత్వంలో స్త్రీ' లో పేర్కొంటాను.

## అధ్యాయం - ఐదు

# భావ కవిత్వంలో స్త్రీ

"ఆమె నవనీత హృదయ, నా యంతరంగ
శాంతి దేవత, ఆశా పథాంతరాళ
పారిజాతమ్ము, ప్రేమ జీవన విభాత
కైశికీ గీతి నాతపః కల్పవల్లి"[1]

—తన హృదయంలో ప్రవేశించిన స్త్రీమూర్తి పట్ల గౌరవభావము, ప్రేమ భావమూ రంగరించి ఆమె ఆకృతిని చిత్రించటానికి ప్రయత్నించారు భావకవులు. పైన పేర్కొన్న పద్యం భావకవుల ప్రేయసీ చిత్రణకి ఒక మచ్చుతునక.

భావకవులు ఎక్కువగా వ్రాసినది ప్రణయ కవిత్వమే. భావకవిత్వంలో కన్పించే ప్రేయసులంతా అపురూప సౌందర్యవతులు, అనురాగ మనస్వినులు. ఈ రెండు అంశాల మీదనే కవిభావన అల్లుకొని, వీటి ఆధారంగానే వీరి కావ్యాల లోని ప్రేయసి వర్ణింపబడుతుంది.

వీరు ప్రేమించిన స్త్రీలపట్ల ఈ కవులందరికీ, అపారమైన గౌరవాభిమానాలు ఉన్నట్లుగా అన్పిస్తూ ఉంటుంది. ఈ స్త్రీలను వీరు దేవతా మూర్తులతో సమాన స్థాయిలో కూర్చోబెట్టి, ఆమెపట్ల పూజ్య భావాన్ని ప్రకటిస్తారు.

"నీవు స్త్రీ జాతి యందు జన్మించు కతన
వరలు చుండును పూజ్య భావంబు నిఖిల

---

1. వేదులవారి దీపావళి - "ఆరాధన" పేజీ : 69.

భామినీ జన లోకముపట్ల నాకు
నీవు నా దృష్టిలో మహాదేవివమ్మ !"[1]

"మానసవీధి దేవతామూర్తివి నీవు"[2] - అంటూ

ఆమె పాదాలకు మ్రొక్కుతారు ఈ కవులు తమ కావ్యాలలో.

"నా భావమెపుడు నిత్య లగ్నంబు నీ పాదనీరజముల"[3] —విశ్వనాథ,

"భవదీయ పల్లవాభిరామ పాదయుగళ
మస్మదీయ మస్తకాభరణంబగు" —తల్లావజ్ఝల,

"ప్రాణకాంతా! పాదపద్మము మ్రోలవాలుదు"[4] —బాపిరాజు

ఆమెని ప్రేమించటం, ఆమె కోసమే తమ బ్రతుకనుకోవటం, ఆమె లేనిదే తమ జీవితాలకర్థం లేదని భావించటం[5], ఈ కవులందరిలో సామాన్యంగా కన్పించే అంశం. ఈ భావాల మీద ఆ కాలంలో విమర్శలు కూడా వచ్చాయి.[8]

---

1. తల్లావజ్ఝల; హృదయేశ్వరి అంకితమిస్తూ చెప్పిన పద్యం.
2. విశ్వనాథ సత్యనారాయణ వరలక్ష్మి త్రిశతి పేజీ : 5 పద్యం. 2.
3. విశ్వనాథ సత్యనారాయణ గిరికుమారుని ప్రేమ గీతాలు పేజీ: 35 పద్యం 2.
4. అడవి బాపిరాజు శశికళ "ప్రణయ కోపన" పేజీ : 44.
5. "నీవు నామది బాసిన నిఖిలజగము
   జడము శూన్యంబు నస్థి సంచయము నగును"
   —కోయిల పాటలు - మంగిపూడి పురుషోత్తమశర్మ.
6. "వీరి స్త్రీ తప్ప వీరికి విశాలదృష్టే కనబడదు. లోకం వీరికి అవిదితమై కూపస్థ మండూక సాదృశ్యం పొందినారు"
   — "నేటికాలపు కవిత్వం", ఉమాకాన్త విద్యాశేఖరులు పేజీ : 122.

ప్రేయసి చుట్టూ చలించే వీరి భావాలని పరిశీలించినపుడు వీరు ఆమె వ్యక్తిత్వానికి కాక సౌందర్యానికే ప్రాధాన్యత నిచ్చినట్లు కన్పిస్తుంది. వీరి ప్రేయసి ఎక్కువగా ముగ్ధగా, అమాయకంగా ఉంటుంది. వీరు తమ ప్రేయసిని ఎక్కువగా పువ్వులతోను, వెన్నెలతోను, విద్యుల్లత, చిరుగాలి, తారక, ఇత్యాది ఉపమానాలతో పోల్చి చెబుతూ ఉంటారు.

భావకవులు వర్ణించిన స్త్రీమూర్తి వారి చుట్టూ ఉన్న ఆనాటి సమాజంలో, అనేక సమస్యలతో, బాధ్యతలతో బ్రతుకు వెళ్ళదీసే అసంఖ్యాక స్త్రీలలో ఎవరికీ చెందదు.

> "ఆమె లోకమ్ములో లేదు ! ఆమె శర్వ
> రీ తపస్విని, ఆమె కార్తికిక చంద్రి
> కా వయస్విని సురకబరీ విలాస
> కీలిత లతాంత లావణ్యగీతి ఆమె"[1]

భావకవులు వర్ణించిన ప్రేయసిని ఊహించుకోవాలంటే, ఒక "మధు ప్లావితగీతా"న్నో "ప్రణయాలయంపుజ్యోతి"నో, "నెలరేక"నో, "వెన్నెల"నో ''ఖేచరీ గంధర్వబాల"నో, "విలయసౌందర్యధాత్రి"నో ''విశ్వగానమోహిని''నో, "ప్రేమ జీవనవిభాత కైశికీ గీతి"నో, "మోహినీ హాసమల్లీ ప్రపుల్లరుచి''నో, ''శ్రీలలితవైజయంతీ పరిమళా'' న్నో, ''తొలి ప్రొద్దు నునుమంచు తీవసొన''నో, గుర్తుచేసుకోవాలి.

అంతేగాని ఆమె కంటూ ఒక రూపం ఉండదు, వాస్తవ జీవితం నుండి, సమాజం నుండి, సమస్యల నుండి పలాయనగతుడైన కవి వీటిలోని వాస్తవికతను జీర్ణించుకోలేక, వీటన్నింటికీ తను అతీతుడననుకొని తనలో తానొక కల్పిత ప్రపంచాన్ని సృష్టించుకొని, దానికి తనని నాయకునిగాను, తను సృష్టించుకొన్న

---

1. ''మహోదయము'' పేజీ : ౨౨౩ .
సహదేవ సూర్యప్రకాశరావు; సంకలనకర్త : తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి.

ఊహా ప్రేయసిని నాయిక గానూ భావించుకొని చేసిన వర్ణనలే ఇవన్నీను. అందుకే ఇందులో ఆమెకు ఒక నిర్దిష్టమైన ఆకృతిగాని, వయసుగాని, పేరుగాని ఉండవు. అదీగాక వీరు చిత్రించిన నాయికల పట్ల వీరు కనబరిచిన ప్రణయమంతా ఏకపక్షముగా ఊహింపబడినదే. ఈ కావ్యాలలోని నాయికలంతా మౌన ముద్రాంకితలే. ఊర్వశి, హృదయేశ్వరి, వత్సల, వరలక్ష్మి వీరంతా వాస్తవ జీవితంలోంచి కవులకు ప్రేరణనిచ్చినవారే. అయినా వీరు కూడా ఆయా కవుల భావనలలో కాల్పనికంగానే మలచబడ్డారు. కవి భావనకే ప్రాధాన్యం ఇక్కడ. భావ కవుల ప్రేయసీ సౌందర్యం కూడా ఎక్కువపాలు కవి సమయానుకూలంగా వర్ణితమైనదే. స్త్రీ సౌందర్యమేగాని ఆమె వ్యక్తిత్వాన్ని ప్రత్యేకించి భావకవులెవరూ బహిర్గతం చేయలేదు.

కాకపోతే వీరు వర్ణించిన స్త్రీ ఆనాటి సమాజంలోని స్త్రీలకు ప్రతినిధి కాకపోయినప్పటికీ, వీరు తమ స్త్రీని ఊహల్లోనే సృష్టిస్తున్నప్పటికీ, స్త్రీని భావకవులు కూడా ఇంకా ప్రేయసిగాను, దేవతగాను మాత్రమే చూస్తూ, ఆమెను కాంక్షిస్తూ, ఆమె కోసం పడిగాపులు పడుతున్నప్పటికీ, ఆమె వర్ణనని మాత్రం భావకవులలో చాలామంది సభ్యంగానూ, సున్నితంగాను, చేస్తారు. అయితే వీరి దృష్టి కూడా స్త్రీ పట్ల సంభోగదృష్టే. ప్రబంధ కవులలో స్త్రీ పట్ల కామపరమైన దృక్పథమెక్కువ. భావకవులలో స్త్రీ పట్ల కోరిక కేవలము శారీరకమే కాదు. అది ప్రేమ భావంతో కలిసి వర్ణితమౌతూ ఉంటుంది. భావకవుల స్త్రీ వర్ణనలో కన్పించే ముఖ్యమైన భేదం ఇదే.

అయితే స్త్రీని దర్శించేటపుడు తమ కావ్యాలలో భావకవులు కూడా ఆమెను తమసాటి మనిషిగా గుర్తించిగాని, సమాజంలోని ఆమె సమస్యలను పట్టించుకుని గాని, సమాజంలోని ఆమె స్థానాన్ని విశ్లేషించిగాని, ఆమెయొక్క మనోభావాలకీ, దృక్పధానికీ విలువనిచ్చిగాని రచన చేయలేదు

ఆంగ్ల కాల్పనిక కవుల రచనలలో ఒక్క ప్రేయసి మాత్రమే కాకుండా వివిధ వర్గాలకు చెందిన స్త్రీలు, వివిధ మనస్తత్వాలను కనబరిచే మహిళలు కన్పిస్తారు.

కానీ ఆంగ్లకాల్పనిక కవిత్వమే ప్రధాన ప్రేరణగా కొని, భావకవిత్వం వ్రాసిన కవులు మాత్రం స్త్రీని ప్రేయసి గానే తప్ప మరో అంశతో చూడలేదు. తమ మాతృమూర్తిని గుర్తుచేసుకుంటూ, ఆమె జ్ఞాపకాలతో 'మాతృగీతా'లని వ్రాసినవారు ఒక్క నాయని సుబ్బారావు గారు మాత్రమే కన్పిస్తారు. వీరి మాతృ గీతాలు కాక తక్కిన ఒకరిద్దరు కవులలో మాతృస్మృతితోడి ఒకటి రెండు ఖండి కలు మాత్రం కన్పిస్తాయి. ఇక మిగతా స్త్రీ చిత్రణ అంతా తాము వలచిన స్త్రీల మీదనో, తాము సృష్టించుకొన్న కల్పిత మూర్తుల మీదనో అయి ఉంటుంది.

వాస్తవానికి తిండీ, తీరికా పుష్కలంగా ఉన్న వర్గానికి చెందిన నాజూకు కవులు వీళ్ళు.[1] అందుకే వీరి కవిత్వంలో "అనవసరమైన అన్వేషణా, కృత్రిమ మైన జాలి, కల్పిత వియోగ బాధ, అవాస్తవికమైన అనుభూతి"[2] - ఉంటుంది. భావకావ్యాలలోని ఈ పాత్రల వర్ణన, ప్రవర్తన నేల విడిచిన సాములాగా అసహజంగా, అర్థరహితంగా ఉంటుంది[3].

అయితే అంతకుముందున్న ప్రబంధ కవిత్వంలోలాగ కాక, వీరు తమ స్త్రీల పట్ల నయినా అపార గౌరవాభిమానాలని ప్రదర్శించడం, వారి పట్ల ఎంతో ఉన్నత భావాలని వ్యక్తపరచడం ప్రత్యేకంగా చేసారు. వీరి స్త్రీ సహనశీలి, ప్రణయమూర్తి, శాంతిదేవత, నవనీతహృదయ.

స్త్రీని కేవలం శారీరకంగా మాత్రమే కాకుండా ఆమెను కొంత హృదయం తోను గుర్తించినది మొదటగా భావకవులే.

భావకవులు తమ కవిత్వంలో స్త్రీకి ఆధిపత్యాన్నిచ్చినా, ఆమె పాదాలకు మొక్కి, ఆమెకు దేవతాత్వమిచ్చి, తాను అమె భక్తునిగా ప్రకటించుకొన్నా ఆమెను

---

1. తెలుగు సాహిత్యవికాసం - భావకవిత - ప్రణయం - డా॥ ముకురాల - రామారెడ్డి; పేజీ : 43.
2. **Ibid; పేజీ : 44.**
3. 'ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్నధోరణులు' - 'కాల్పనిక వాదం' **J. V.** రాఘవేంద్రరావు పేజీ : 22.

ఒక అనుభూతిగా మాత్రమే తయారుచేసారు. ఆయా పాత్రలకి సజీవ వ్యక్తిత్వం లేదు. "ఊర్వశి కావచ్చు, పేరు లేని ప్రేయసి కావచ్చు ఎవరైనా ఆకృతిలేని అనుభూతికి ప్రతి రూపాలే". [1]

ఆదే విషయాన్ని ఇంకా స్పష్టంగా విశదీకరిస్తూ, వెల్చేరు నారాయణరావు గారు తమ "తెలుగులో కవితా విప్లవాల స్వరూపం'' లో ఇలా వ్రాసారు.

"అనుభూతి ప్రధానమైన భావకవిత్వం స్త్రీ హృదయం మాత్రమే స్పృశించింది. ప్రబంధ కవిత్వానికి స్త్రీ అంటే శరీరం. భావకవిత్వానికి స్త్రీ కేవలం హృదయం. అక్కడ ఆమెకు హృదయం లేదు ఇక్కడ ఈమెకు శరీరంలేదు''. [2]

అయితే భావకవులంతా కేవలం స్త్రీ హృదయాన్ని మాత్రమే దర్శించలేదు. భావకావ్యాలలో స్త్రీ అంతా ఇలాగే ఉందనుకున్నా, భావకవులందరి దృక్పధాలు స్త్రీ పట్ల ఇట్లాగే పయనించాయనుకున్నా పొరపాటే. పై భావనలకు విరుద్ధమైన దృష్టితో కూడిన భావకావ్యాలూ, గీతాలూ ఆనాడూ వచ్చాయి. స్త్రీని కేవలం భోగ దృష్టితోచూచి వర్ణించిన భావకవులు లేకపోలేదు. ప్రేయసిని చాలా ఉన్నతమైన భావనలతో తీర్చిదిద్దిన భావకవులలో కూడా స్త్రీపట్ల కాంక్షాపూరిత దృక్పథంతో కూడిన గేయాలు కన్పిస్తాయి. భావకవులు కూడా స్త్రీని శారీరకంగా గుర్తించే పదాలతో సంబోధించారు. అయితే అది ప్రబంధ కవిత్వంలో మాదిరిగా పైకి ప్రస్ఫుటంగా కన్పించక వారి ప్రేమలో మిళితమైపోయింది.

"భావకవితా ప్రణయం మొత్తం శరీరాతీతమైనది. అందులో శారీరక సంయోగ ప్రసక్తి కన్పించద''ని[3] విమర్శకులు భావించి నప్పటికీ అలా వర్ణించిన సందర్భాలూ, స్త్రీపట్ల మోహపూరితమైన వర్ణనలూ భావకవిత్వంలోనూ కొల్లలుగా కన్పిస్తాయి.

1. వెల్చేరు నారాయణరావు - తెలుగులో కవితా విప్లవాల స్వరూపం పేజీ : 145.
2. **Ibid,** పేజీ : 128.
3. **Ibid.**

''అధికార ధనకీర్తులన్నియుం గలసి
కలికి చందమున నాకర్షింప లేవు;
దీని రసా నవోద్రిక్త దృష్టులకు
విశ్వంబు సర్వంబు వెఱ్ఱెత్తియాడు''[1]

పై భావనలో కవికి స్త్రీ పట్ల ఉన్నది కేవలం మోహదృష్టి అన్నది స్పష్టమౌతూ ఉంది. ఈయన "అభినవ భావకావ్యం''గా పరిగణించిన తన "స్నానఘట్టము" లో స్త్రీని శారీరకంగా అణుమాత్రం కూడా వదలకుండా వర్ణిస్తాడు.

"కలికి పాలిండ్లు చొక్కపుఁ బూలచెండ్లు
ననవిల్తు కోట కెత్తిన పైఁడి గిండ్లు"[2]

ఇలా వ్రాసిన భావకవికీ, ఆ ప్రబంధ కవికీ ఏమీ తేడా కన్పిచదు.

''బాహు మూల ద్యుతుల్ పై పై కిఁ బ్రాఁక
లేదు కంచెల విదిలించుటం జూడ
స్మర యశశ్చంద్రికల్ మలయంగ విజయ
కేతనం బెత్తిన రీతి స్ఫురించె"[3]

పై పద్యం ఒక భావకవి వ్రాసినదని చెప్పకపోతే ఇది తప్పక ఎవరో ప్రబంధ కవి వ్రాసిన పద్యమేనని విశ్వసించ గల్గినట్లుగా ఉంటుంది.

''వృద్ధుని కేని నయ్యింతిఁ గన్నత
పరమ యౌవన పాటవము కల్గఁజొచ్చె"[4]

—లాంటి భావాలలోను, కవి దృష్టి ఎలాంటిదో తెలుస్తుంది.

---

1. కాళ్ళకూరి గోపాలరాయకవి ''స్నానఘట్టం'' - పేజీ : 15.
2. కాళ్ళకూరి గోపాలరాయకవి - స్నానఘట్టము - పేజీ : 18.
3. **Ibid.**
4. **Ibid** - పేజి : 20.

"చిత్తజోద్వృత్తికి సిగ్గుగ్గులేదు" - అని సమర్థించుకుంటూ "స్త్రీ చక్కఁదనమె చారిత్రంబు చూడ"[1]

అని తన ఉద్దేశ్యాన్ని బయటపెడతాడు కవి.

స్నానం చేస్తున్న యువతిని వర్ణిస్తూన్న సందర్భంలో కవి

"వెలఁది నీట మునుఁగు కొలఁదిఁ జూపఱకు
విదిత వికారంబు లుదయించె
కామాగ్ని మహిమంబు గనఁదరం బగునే?"[2]

అని వ్రాసినపుడు కవి దృక్పథమేమిటో తెలుస్తుంది. మరొకచోట శ్రీ గోపాలరాయకవి,

"స్తన భరంబును, మఱి జఘన భారంబు
నసియాడు కౌఁదీవ నట్టట్టు లూఁప
నడకకుందాళ మానంబులు గాఁగ
పెనఁగొను తడిచీర పెళపెళ లాడ
బిందెలోపలి నీరు చింది చిందాడ
ద్రష్టల గుండియల్ దడదడ లాడ"[3]

— అంటూ స్త్రీని వర్ణిస్తాడు. ప్రాచీన కవుల మాదిరిగానే

"తరళాయతాక్షి మధ్యం బాకసంబు
కవి సమయంబు నిక్కంబ"[4]

---

1. కాళ్ళకూరి గోపాలరాయకవి-స్నానఘట్టము-పేజీ : 25.
2. Ibid - పేజీ : 29.
3. Ibid - పేజీ : 141.
4. Ibid - పేజీ : 42.

- అంటూ స్త్రీ వర్ణన చేసిన భావకవిలో భోగదృష్టి మాత్రమే కన్పిస్తుంది.

కవి కొండల వెంకటరావు గీతాలలోనూ స్త్రీని వర్ణించే సందర్భాలలో విశృంఖలత వ్యక్తమౌతూ ఉంటుంది.

''కదలని కర్కశ కుచములు
- బొంగరాలటన్న నేమి ?
నాదు కనులు మెఱసి వెలసి
- వాని మొనల నిలిచి తిరుగు! [1]

— కవికొండల వారి పై వర్ణనలో తక్కిన భావకవుల కన్నా భిన్నమైన కాముక దృష్టి స్త్రీ పట్ల కన్పిస్తుంది.

''మాయలాడి విప్పేది - మనసా?
- లేక మేని చీర?''[2]

— అని రాసిన ఈ గీతంలో ఈ భావకవి వ్యక్తపరిచిన భావాలలో ఎక్కడా సభ్యత కనబడదు. కవి తన కాముకదృష్టినీ, తన తృష్ణనీ ఒప్పుకుంటూ,

"ఆకలి మోహం రెండూ కూడా
ప్రకటించే నా కన్నులను''[3]

— అంటూ రాస్తాడు.

''చీరను రైకను దెలిసే దానిని
శరీరమే ఇచ్చేస్తానంటే''[4]

— లాంటి భావాలలోను,

---

1. కవికొండల వెంకటరావు గీతాలు ''రూపమరసి'' - పేజీ : 45.
2. Ibid - పేజి : 55, "సుఖము''
3. Ibid - పేజీ : 63 ''సకియా''
4. Ibid - ''చీర-రైక'' పేజీ : 66

''కొన్నవాని కెంత తెలివో - అమ్మువాని కంత తెలివి
ఉన్నదొక్క యేగాణి - వత్తువటే రంగసాని''1

''ప్రేమ కింత పెనుగులాట? రామకాన! ఏమనెదవు
నా కడ నొక మన్మథుండు - నీకడ నొక రతియులే''2

— లాంటి చరణాలలోను కవికి స్త్రీ పట్ల ఉన్నది కేవలం సంభోగ దృష్టేనన్నది కొట్టవచ్చినట్లుగా కన్పిస్తుంది.

స్త్రీని అంగాంగ వర్ణనతో భావకవులు కూడా వర్ణించారు. ''నగ్న'' అనే పాటలో శశికళను వర్ణిస్తూ బాపిరాజు,

''అమృత కలశ మామెకు కటి,
ఢమరుక మధ్యమ్మ నడుము
పారిభద్ర సుమ కుచములు''3

— పాత కవి సమాయానుకూలంగా తన ఊహా ప్రేయసిని కొలుస్తారు.

''నే భయంకర కాముకుడ
నా కరాల చితిని
కన్యకలు వెన్నవలె కరిగి పోదురు''4

—అని వెల్లడయిన భావాలు,

---

1. కవి కొండల వెంకటరావు గీతాలు - ''మొలక నగవు'' పేజీ : 44.
2. కవి కొండల వెంకటరావు గీతాలు - ''రూపమరసి'' పేజీ : 45.
3. బాపిరాజు - శశికళ, ''నగ్న'' పేజీ : 30, 31.
4. ముద్దుకృష్ణ వైతాళికులు - 'రక్తవిహారము' - రామచంద్ర అప్పారావు పేజీ : 76.

> "రజస్వల కాకముందె చన్నులు వచ్చినవి"[1]

లాంటి వర్ణనలూ ఆ కాలంలో వెలువడినవే.

ఊర్వశి కావ్యారంభంలో కృష్ణశాస్త్రి,

> "నా కరిన పాదశిలల క్రిందఁబడి నలఁగి
> పోయె నెన్నెన్నియో మల్లెపూలు మున్ను"

అని చెప్పిన తన మాటల్లోనే కవికి ఊర్వశీ కావ్యం వ్రాయక ముందు స్త్రీ పట్ల కాంక్షాపూరిత దృక్పథమే ఉండేదని తెలుస్తుంది. అందుకే కృష్ణశాస్త్రి "కృష్ణపక్షము" లో దక్షిణ నాయకుడైన పురుషుని ప్రవర్తనను సమర్థించే పంక్తులెన్నో కన్పిస్తాయి. కృష్ణపక్షములోని "స్వేచ్ఛా గానము" అనే పాటలో కవి వ్యక్తపరిచిన భావం గమనించదగ్గది.

> "అలరు పడంతి జక్కిలిగింత వెట్టి
> విరిచేడె పులకింప సరసను బాడి
> మఱి యొక్క నన తోడ మంతనం బాడి
> వేఱొక్క సుమకాంత వ్రీడఁ బోఁ గొట్టి
> క్రొందేనె సోనలఁ గ్రోలి సోలుటకుఁ
> బూవు పూవునకును బోవుచు నుందు;
> నవ్విపోదురు గాక నాకేటి సిగ్గు"[2]

పై పాటలో నవ్విపోయినా లెక్కచేయక సిగ్గులేకుండా స్వేచ్ఛగా విహరిస్తాననే తుమ్మెద దక్షిణనాయకత్వాన్ని నెరపే పురుషునికి ప్రతీక.

కృష్ణశాస్త్రిదే "తేటివలపు" అనే పాటలో కూడా కుసుమ - భ్రమర సంబంధం ద్వారా పరోక్షంగా స్త్రీ పురుషులలో పురుషాధిక్యతకు ప్రాధాన్యత నిస్తూ కవి ప్రకటించిన—

---

1. పండిత ఉమాకాన్త విద్యా శేఖరులు-నేటి కాలపు కవిత్వం 'శృంగారాధికరణం' పేజి : 159.
2. కృష్ణశాస్త్రి-కృష్ణ పక్షము "స్వేచ్ఛా గానము" పేజి : ౬.

''తేనెలం గూర్చి వలపులఁ దేటపటచి
ధన్యురాలయ్యె మీ చెలి తలిరుబోణి!
కాని నిరతంబు మల్లిక కడనె యుండి
ముదము గూర్పఁగ మా కొక్క పూవె చెపుమ?''[1]

—వంటి భావాలలో కవికి భోగలాలసత మీద ఉన్న మక్కువ వ్యక్తమౌతుంది. అయితే కృష్ణశాస్త్రి తొలినాటి కవిత్వంలో వ్యక్తమయిన ఇటువంటి భావాలు ఊర్వశి కావ్యంలో కనిపించవు.

"పరాజయము" అనే గీతికలో ప్రేయసి తన ప్రియుని ఉద్దేశించి పలికినట్లుగా వ్రాస్తూ నోరి నరసింహ శాస్త్రి,

"సిగ్గు పొరదాటి, పటు భుజాశ్లేష మందు
ఎప్పుడీ సఖి తనువు బంధించి నావొ
అర్పితం బయ్యె నపుడె నా యాత్మ నీకు
రణ పరాజితుడైన శాత్రవుడు వోలె!"[2]

శరీరాకర్షణే ప్రధానంగా చిత్రితమైన పై గేయంలో ప్రేయసి పలికిన మాటలలో బానిసతనం స్పష్టంగా ధ్వనిస్తోంది. ఆమె "రణ పరాజితుడైన శాత్రవుని"లా అతనికి లొంగిపోయిందిట. రణ పరాజితుడైన శాత్రవుడు ఎప్పుడూ ఇష్టపూర్వకంగా లొంగడు. పోరాడే శక్తి లేని పక్షంలోనే గత్యంతరం లేక లొంగిపోతాడు. దీనిని ఈ భావకవి ప్రేమగా చిత్రింప బూనటం, ప్రేమపట్ల కవికి గల అస్పష్టతని చూపిస్తోంది. అదీగాక ప్రేయసి ప్రియుల సంబంధాన్ని రణ పరాజితుడైన శాత్రవునికి, గెలిచిన వానితో గల సంబంధంతో పోల్చి చూపటం వికారమైన భావం.

---

1. కృష్ణశాస్త్రి-కృష్ణపక్షము "తేటివలపు'' పేజి : ౧౦.
2. ముద్దు కృష్ణ - వైతాళికులు "పరాజయము" - నోరి నరసింహ శాస్త్రి పేజీ : 79.

ఇందులో ప్రేయసి తాను అతని ''సఖి'' అంటే స్నేహితురాలినని చెబుతూనే, తాను అతనికి యుద్ధంలో ఓడిపోయిన శత్రువులాగా లొంగిపోతున్నానంటూ మాట్లాడుతుంది.

ఇక్కడ కొత్తగా వచ్చిన ప్రేమని రాయాలనే సరదా ఒకవైపు, ఆడదాని గురించి శతాబ్దాలుగా ముద్రపడిపోయిన ఆలోచనల బలం మరొకవైపు కవిమీద పనిచేస్తున్నాయి.

అంచేతనే ఈ ప్రేమ కవిత్వంలో కూడా ప్రియుడు అంటే మగవాడు గొప్పవాడు, బలవంతుడుగానూ; ప్రేయసి అంటే ఆడది మాత్రం బానిస, బలహీనురాలూగానూ చిత్రించబడింది.

రాయప్రోలు సుబ్బారావు అమలిన శృంగార సిద్ధాంతం యొక్క ప్రభావం అతని తర్వాత వచ్చిన భావకవులపై లేదు. స్త్రీని కాంక్షా పూరిత దృక్పథంతో వర్ణించిన భావాలు కొందరు కవులలో కన్పిస్తాయి.

''ఆ మబ్బు ఈ మబ్బు
ఆకాశ మధ్యాన
అద్దుకున్నట్లు మన
మైక్య మౌదామె ?''[1]
అన్న బసవరాజు అప్పారావుగారి గేయంలోను,
''నీ గులాబి నవ్వు
లో గుబులొ్కను తావి,
ఆ లేత భావాలు,
ఆ వింత సైగలూ,
నా గుండెలను లాగ
నా యౌవనము రేగ''[2]

1. బసవరాజు అప్పారావు గేయాలు "ఐక్యమౌదామె" - పేజీ : 41.
2. మల్లవరపు విశ్వేశ్వరరావు - మధుకీల ''ప్రేమగానము'' - పేజీ : ౨౦.

మల్లవరపు వారిదే మరో గేయంలో

"ఏ తారా కోమలాంగివో నీవు
ఏ తేజ స్నిగ్ధ దేహవో కాని
నా స్వప్న ప్రాంతరాంత రాళంలో
నీ స్వర్ణాంకిత కింకిణీక్వణాహ్వానం
రేకెత్తించి, నదించి, ప్రజ్వలించావే
నా కామం"[1]

పైన వివరించిన అభిప్రాయాలను అన్నింటినీ పరిశీలించినపుడు "భావ కవులు స్త్రీని కేవలం హృదయంతో మాత్రమే సందర్శించారని, భావకవుల ప్రణయం శారీరక సంయోగాతీతమైనదని" భావించే విమర్శకుల అభిప్రాయం సంపూర్ణమైనది కాదని అర్థమవుతుంది.

## భావకావ్యాలలో స్త్రీ తనను దాసిగా పేర్కొంటుంది :

"దాసిగా నుంటకైన
తగనా ప్రాణేశ దేవ?
పాదమ్ములు నొచ్చినంత
పట్టుటకైనను దగనా?
తలపై నీ పాద ధూళి
దాల్చుట కైనను తగనా?[2]

బసవరాజు అప్పారావు గేయంలో పై మాటలను పలికిన స్త్రీ ఇంకా బంధనాలలో ఉన్న పాతకాలపు స్త్రీకి ప్రతిరూపమే. ఈ "దాసి" అనే పదాన్ని తన గేయాల్లోని నాయికచేత పలుమార్లు పలికిస్తారు బసవరాజు అప్పారావు[3]

1. మల్లవరపు - కళ్యాణి కింకిణి "స్త్రీ" పేజీ : ౧.
2. బసవరాజు అప్పారావు గేయాలు "తగనా?" - పేజీ : 31.
3. దీప కళికలు విన్ననై తెల్లబారె
పాన్పుపై నిద్ద పూవులు వాడిపోయె
పిట్టలన్నియు తమ గూళ్ళు వీడి పరచు
స్వామి, నీ దాసి కడకింక వచ్చుటేమి ?

ఊర్వశి[1], హృదయేశ్వరి[2] కూడా తమ కవులతో సంభాషిస్తున్నప్పుడు "దాసి" పదాన్ని వాడతారు. వేదుల తన 'కన్నీటి పాట' అనే ఖండికలో తన ప్రేయసి భావనలను ఇలా వ్రాస్తారు.

"కనులెత్తి కనినంత గరిగి పోయితిని
మాటలాడిన యంత మమతను గొంటి
పాటఁబాడినయంత బరవశనైతి
దరి జేరినంతనే దాసినై పోతి"[3]

ఇంకా - "నీ పవిత్ర పదాబ్జ సన్నిధిని నిలుచు చనువు నొసంగితి
వంతియే చాలు ననుచు నెంత యుప్పొంగిపోతి"[4]

—వంటి భావాలు వీరి కావ్యాలలోని నాయికల నోటి వెంట వెలువడుతాయి. ఈ "దాసి" అనే పదాన్ని వాడటంలోను, పాదదాసిగా తనని భావించుకోవటం లోనే భావకవిత్వంలో స్త్రీ, ఇంకా భావదాస్యం నుంచి విముక్తురాలు కాలేదని తెలుస్తుంది. ఇలా ఆడవాళ్ళు చరణదాసిగా అతనికి తమని అర్పించుకోవాలనుకునే ఆలోచనలు ఇంకా పాతభావాల తాలూకు అవశేషాలే. అయితే ఇటువంటి భావాలని విమర్శకులు గుర్తించకుండానే భావకవులు తమ కవిత్వంలో స్త్రీకి గొప్ప స్థానాన్ని ఇచ్చారని తీర్మానించటం జరిగింది.

కొన్ని భావ కావ్యాలలో వెలువరించిన కవుల అభిప్రాయాలు ఇంకా స్త్రీని పురుషుని కోసం సృష్టించినట్లు ప్రకటితమయ్యాయి.

"బురుషుల జీవితం బలరఁజేయ
స్త్రీల నిర్మించెను విరించి సృష్టి యందు"[5]

---

1. కృష్ణశాస్త్రి - ఊర్వశి - పేజీ: ౧౩౯.
2. తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి - హృదయేశ్వరి - పేజీ: ౧౨౬.
3. వేదుల సత్యనారాయణశాస్త్రి - దీపావళి - "కన్నీటిపాట" పేజీ: 90.
4. వేదుల - దీపావళి - "నిష్కృతి" పేజీ: 23.
5. దువ్వూరి రామిరెడ్డి - "వనకుమారి" పేజీ: 84.

"లతలు కాంతలు నాశ్రయోల్లసితలెపుడు"[1]

పై అభిప్రాయాలలో ఎక్కడా స్త్రీపట్ల అభ్యుదయకరమైన దృక్పథం కన్పించదు. ప్రబంధ కవుల నోట బహుళంగా వెలువడిన ఇటువంటి భావాలే, ఇంకా భావకవినోట కూడా వెలువడటం గమనిస్తే, స్త్రీపట్ల ఫ్యూడల్ వ్యవస్థ ఇచ్చిన దృక్పథం నుంచి భావకవులు కూడా బయటపడలేదని తెలుస్తుంది.

అయితే స్త్రీపట్ల అభ్యుదయ భావాలను కన్పరిచిన భావకవులు కూడా ఉన్నారు. తమ కావ్యంలో నాయిక తనని చరణదాసిగా భావించుకుంటే, ఆ భావాన్ని సరిదిద్దుతూ, హృదయేశ్వరి కావ్యంలో తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారు ఆమెతో ఇలా పలుకుతారు.

"పలుక దగునె యిట్లు ప్రాణేశ్వరీ నీవు !
కరుణ గాదు నాకు, గారవంబు
కనికరంబు దీన జనముల యెడనె ! నా
మతము నందు భార్య మాన్యురాలు"[2]

"మగడు వేల్పన పాత మాటది
ప్రాణ మిత్రుడ నీకు"[3]

అని చెప్పుకున్న గురజాడ అప్పారావుగారి లోనూ స్త్రీని సమాన స్థాయిలో చూసే మనస్తత్వం కన్పిస్తుంది.

ఇక ఆ కాలంలో కవిత్వం వ్రాసిన భావ కవయిత్రుల రచనలలో కూడా భావకవి భావాలకు నకలుగా పలికే కవయిత్రి గొంతు మాత్రమే విన్పిస్తుంది గానీ స్త్రీ యొక్క ప్రత్యేకత ఎక్కడా కన్పించదు

---

1. దువ్వూరి రామిరెడ్డి - "వనకుమారి" పేజీ : 73.
2. తల్లావఝ్ఝల - హృదయేశ్వరి, పేజీ : ౧౨౬.
3. గురజాడ - ముత్యాల సరాలు - 'కాసులు', పేజీ : 68.

"వచ్చి లాలించేటి ప్రియుడా !
నన్ను మచ్చికల నలరించు ప్రియుడా !
హెచ్చయిన ప్రేమ సుధ లిచ్చి
నన్ను వగల మరపించేటి పి్రియుడా !"[1]

— అనే చరణంలోనూ

"విరహ వ్యధలు ! విరహ వ్యధలు
ఓర్వలేని విరహ వ్యధలు
అగ్నిమండి గుండెలోన
ఆరదేమి చేతునే !"[2]

అని ప్రకటించిన భావంలోనూ కవయిత్రులు కూడా ప్రణయాన్నీ; విరహాన్నే వ్యక్తపరిచారుగాని తమ తోటి స్త్రీల పరిస్థితిని ఎక్కడా ప్రతిఫలింప జేయ లేదు. ఇలా కవులే వ్రాసినా, కవయిత్రులే వ్రాసినా తమ కావ్యాలలో కేవలం సుకుమారి, సున్నిత మనస్విని అయిన స్త్రీని మాత్రమే సృష్టించారు. జీవితంలో సమస్యలతో బాధలు పడే స్త్రీని గాని, లోకం పోకడ, గడుసుతనం, ఆటుపోట్లని తట్టుకునే మనస్తత్వం గల స్త్రీలని వీరు ఊహించ లేదు. కొన్ని భావ చిత్రాలలో మాత్రం వాస్తవంగా అనిపించే స్త్రీ అలవోకగా కన్పిస్తుంది.

"మాసిన చీరతో
పొగడ మ్రాకుల రెమ్మల నీడ
దీర్ఘ నిశ్వాసములన్ని గిడ్చె"[3]

అంటూ కొడాలి సుబ్బారావు గారు వర్ణించిన రాధలో ఒక మధ్యతరగతి యువతి కన్పిస్తుంది. అలాగే విశ్వనాథ సత్యనారాయణ "చిన్ని మబ్బులు" అనే

1. ముద్దుకృష్ణ - వైతాళికులు "ప్రియుడా"- విశ్వసుందరమ్మ, పేజీ :- 52-
2. ముద్దుకృష్ణ - వైతాళికులు "కుపితవిధి"- విశ్వసుందరమ్మ, పేజీ : 124
3. ముద్దుకృష్ణ వైతాళికులు - 'రాధ' - కొడాలి సుబ్బారావు, పేజీ : 144.

గేయంలో కూడా ఒక గృహిణి, తొలిసారి బిడ్డనెత్తుకున్నప్పటి అనుభూతి కన్పిస్తుంది.

''తొలి కాన్పు పసిపాప
సాకనేరని బాల,
తెలవోయి పతిజూచి
కళవళించిన వేళ''1

పై భావ చిత్రంలో బిడ్డని సరిగా ఎత్తుకోవటం రాక పతి మొహంలో తెల్లబోయి చూసే ఆ గృహిణి జాడ, కవి జీవితంలోనిదే గాని, ఊహల్లోది కాదు. ఇది ఊహకు దొరికేది కాదు. అయితే ఇటువంటి సన్నివేశాలు భావ కవిత్వంలో క్వాచిత్కంగా కన్పిస్తాయి.

నిజానికి భావకవితా యుగం నాటి సమాజంలో స్త్రీ సాంఘిక పరిస్థితి చాలా అధ్వాన్నంగా ఉంది. ఇంకా బాల్య వివాహాలు, కన్యాశుల్కాలు పోలేదు. ఎందరో బాల వితంతువులు ఆ రోజుల్లోనూ ఉన్నారు. మంగిపూడి వెంకటశర్మ, ముట్నూరి వెంకటసుబ్బారాయుడువంటి కవులు ''బాల వితంతు-విలాపము'' వంటి కావ్యాలలో నాటి స్త్రీ హీన స్థితిని చిత్రించారు. కానీ మరి ఏ భావకవీ కూడా తన చుట్టూ సమాజంలోని స్త్రీని పట్టించుకోలేదు.

భావ కవులలోకూడా తమ భార్యలను పతివ్రతలుగా కీర్తించటం కన్పిస్తుంది. విశ్వనాథ తన భార్యను,2 నాయని తన వత్సలను పతివ్రతలుగా పేర్కొంటారు.

''వహ్నిఁగ్రాగక కమ్మని వాసనలకు
పుట్టినిల్లగు నేయి కాఁబోదు వెన్న
ఆ పదల పేరు విన్న భయమ్ము సెందు
వనితల పతివ్రతాత్వమ్ము వాసిఁగనునె''3

1. ముద్దుకృష్ణ వైతాళికులు - 'చిన్నిమబ్బులు' - విశ్వనాథ, పేజీ : 145.
2. విశ్వనాథ-వరలక్ష్మిత్రిశతి - పేజీ : 20.
3. నాయని - సాభద్రుని ప్రణయ యాత్ర- పేజీ: 16

అని అనుకునే వత్సలలో ఆమె తన వలపు గెలుపు కోసం "పార్వతిని, దమయంతిని, సావిత్రిని గుర్తు చేసుకోవటంలో నాయికలోని పతివ్రతా తత్త్వాన్ని కవి ప్రత్యేకంగా పేర్కొంటాడు.

భావ కావ్యాలలో ప్రేయసి తర్వాత కన్పించే స్త్రీ తల్లి. కానీ ఈమె కూడా చాలా తక్కువగా కన్పిస్తుంది. ప్రత్యేకించి మాతృగీతాలని వ్రాసినది ఒక్క నాయని వారే. ఇది కాక వేంకట పార్వతీశ్వర కవుల "మాతృ స్తవము" అనే ఒక గీతం వారి కావ్యకుసుమావళిలో కన్పిస్తుంది.

నాయనివారు తమ మాతృగీతాలలో తల్లికి తన అంతరంగాన్నే దేవాలయం చేసి ఇలా వ్రాస్తారు :

> "ఇంక నా జీవితమ్ము నీస్మృతికి చెక్క
> బడిన యొక శాసనమయి వరలు నటవె
> చిన్ని నీ విగ్రహము ప్రతిష్ఠితము నాదు
> నంతరంగమ్ము నీకు దేవ్యాలయమ్ము"[1]

మాతృదేవతా చరణ పద్మములకు మనసార కుసుమాంజలులు ఘటించు తారు.[2]

వేంకట పార్వతీశ్వర కవులు తమ 'మాతృ స్తవము' అనే గీతంలో[3] చిన్న తనాన తల్లిని సరిగా పట్టించుకోలేదని వ్యధ చెందుతారు. 'మాతృస్మృతి' అనే గేయంలో[4] గతించిన తల్లిని తల్చుకుని ఆమెనెప్పటికీ మరువనని ఆమెకు ప్రణతు లర్పిస్తాడు కవి.

---

1. నాయని - మాతృగీతాలు : పేజీ : 5.
2. నాయని - మాతృగీతాలు : పేజీ : 5.
3. వేంకట పార్వతీశ్వర కవులు - కావ్యకుమావళి తృతీయభాగం : పేజీ : 19.
4. ముక్కదిల్లి వెంకటనారాయణ; ౧౯౨౫ ప్రబుద్ధాంధ్ర ౧౨ వ సంచిక 'మాతృస్మృతి'.

భర్త మరణానికి దుఃఖిస్తున్న సోదరిని ఊరడిస్తూ వేంకట పార్వతీశ్వర కవులు—

''అకట ! జీవితమే వ్యర్థమయ్యె ననుచు
నర్థ దేహంబు పోయిన దనుచుఁ దలఁచి
సోదరీ ! దరిగానని శోక జలధి
మునుఁగ నేమిటి?''[1]

—అంటూ ఆమెను ప్రశ్నిస్తారు.

ప్రియుని తిరస్కారానికి గురైన స్త్రీని 'కళంకిని'గా అభివర్ణిస్తూ మంగిపూడి పురుషోత్తమశర్మ,

''పాపిని యటంచు ప్రియుడు
నన్ బాసిపోయె;
కోపమును జెంది విరహాగ్ని గూల్చి చనియె
అనుచు నే మోము వెట్టుక యాడుదాన?
ఆడుదాన నెటుల లజ్జ వీడుదాన?''[2] - అని వ్రాస్తారు.

పై గీతానికి 'కళంకిని' అని పేరు పెట్టటంలో ఔచిత్యం కనిపించదు.

స్త్రీ పట్ల గల మౌలికమైన దృక్పథం ప్రబంధ కవికి లాగానే భావ కవికి కూడా కేవలం సంయోగమే. భావ కవుల యొక్క ఈ దృష్టి ప్రేమలో రంగ రింపబడి వ్యక్తమౌతుంది. స్త్రీ పట్ల వీరు చూపించిన ప్రేమ కూడా "జీవిత సన్ని వేశాల నుంచి కలిగిన ఒక చిత్త వృత్తిగా కాకుండా, ఒక అతిలోక తత్త్వంగా

---

1. వేంకట పార్వతీశ్వర కవులు - కావ్యకుసుమావళి (తృతీయ భాగము) - ''ఆశ్వాసము'', పేజీ : 23
2. మంగిపూడి పురుషోత్తమశర్మ - కోయిలపాటలు - 'కళంకిని'; పేజీ : 47, 48.

భావించడం వల్ల భావ కవిత్వంలో ప్రాణవంతమైన పాత్రలకి చోటు లేక పోయింది."[1]

స్త్రీని వాస్తవ జీవితం నుండి గ్రహించి, తన కవిత్వంలో ఆమె నిజమైన సాంఘిక స్థితిని ప్రదర్శించినది ఒక్క గురజాడ మాత్రమే. అతని మార్గాన్ని ఆటు తర్వాత భావ కవులు ఎవ్వరూ అనుసరించలేదు. "కానీ, గురజాడ మార్గమే కొనసాగి ఉంటే నిజానికి భావకవితాదశ తెలుగుసాహిత్యంలో ఉండేదేకాదు."[2]

"గురజాడలో ఆమె ఇంకా ఊహా ప్రేయసి కాదు, భార్యే."[3] కానీ తక్కిన భావ కవులలో మాత్రము ఆమె వాస్తవిక జీవితం నుండి గ్రహించిన స్త్రీ కాదు. భావ కవులు తమ భార్యలను గాని, తమ జీవితాలలో తమకు తటస్థపడిన స్త్రీలను గాని, వర్ణించవలసి వచ్చినప్పుడు కూడా కాల్పనికతనే ప్రదర్శించారు. తమ దృక్కోణాలను నుంచి ఆమెను గ్రహించారు కానీ, ప్రత్యేకంగా ఆమె ఆలోచన లను గ్రహించలేదు

అయితే భావ కవులలో కొందరైనా స్త్రీ స్థానాన్ని కొంత గౌరవ ప్రదంగా చిత్రించటం వలన సాహిత్యంలో స్త్రీకి అంతకుముందు లభించని మరొక రూపం లభించే అవకాశం కలిగింది. స్త్రీని ప్రబంధ కవిత్వంలో కట్టిపడేసిన అంగాంగ వర్ణన నుంచి తప్పించినది భావ కవులే. అయితే వీరు స్త్రీని ఆ సంకెళ్ళ నుంచి తప్పించినా 'ప్రణయం' అనే మరొక సంకెలతో ఆమెను బంధించి వేసారు. ఆమెకున్న సహజ సిద్ధమైన గుణాలతో, ఆమెకున్న అభిరుచులతో, ఆమెలోని బలహీనతలతో స్త్రీని భావకవులు కూడా గుర్తించలేదు. అందువల్లనే భావ కవిత్వంలో కూడా స్త్రీ యొక్క స్వరూపం అస్పష్టంగానే ఉంటుంది.

---

1. వెల్చేరు నారాయణరావు - తెలుగులో కవితా విప్లవాల స్వరూపం, పేజీ : 145.
2. **Ibid** - పేజీ : 98.
3. **Ibid** - పేజీ : 103

# ముగింపు

భావకవిత్వం వరకూ కవిత్వంలో చిత్రింపబడిన స్త్రీని పరిశీలిస్తే ఆమెకు అటు సమాజంలోనూ, ఇటు సాహిత్యంలోనూ సరైన గుర్తింపు ఇవ్వలేదని తెలుస్తుంది. సమాజంలో దోపిడీకి గురికాబడుతున్న స్త్రీ స్థితిని సంస్కరించే ప్రయత్నం చేసింది, శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు.

పంతులు గారు నడిపిన ఉద్యమ ఫలితంగా ఆనాటి యువకవుల ఆలోచనలలో వచ్చిన అభ్యుదయకరమైన మార్పు, వారి కవిత్వంలో స్త్రీ పరిస్థితి మారటానికి కారణమైంది. ఆంగ్ల విద్యాపఠనం మూలంగా వీరికి పశ్చిమ దేశాల సాహిత్యంతో పరిచయ మేర్పడింది. ఆంగ్ల కాల్పనిక కవిత్వంలోని స్త్రీకి, ప్రాచీన ప్రబంధ కవిత్వంలోని స్త్రీకి ఉన్న భేదాన్ని వీరు గుర్తించారు. కందుకూరి ఉద్యమమూ, ఆంగ్ల కాల్పనిక కవిత్వ ప్రభావమూ కలిసి భావకవిత్వంలో స్త్రీ ఆదర్శంగా చిత్రింపబడటానికి దోహదం చేసాయి.

అయితే ఏ ప్రయోజనాన్ని ఆశించి భావకవులు, తమ కవిత్వంలో స్త్రీ చిత్రణలో మార్పుని తీసుకువచ్చారో, ఆ ప్రయోజనం మాత్రం నెరవేరలేదు. దానికి కారణం కేవలం తమ అనుభూతులే ఆధారంగా స్త్రీని దర్శించటం చేసారు గాని వాస్తవమైన స్త్రీని తమ కావ్యాలలో చూపించలేదు.

స్త్రీనే తమ ప్రబంధాలలో చిత్రించిన పూర్వకవులకు గాని, స్త్రీనే తమ ప్రణయానికి ఆలంబన చేసుకుని కావ్యాలు వ్రాసిన భావ కవులకు గాని ఆమెను వాస్తవంగా చిత్రించాలన్న కోరికాలేదు, ధ్యేయమూ లేదు. ఈ రెండూ ఉన్న కందుకూరి ఉద్యమాలనైతే నిర్వర్తించాడు గాని స్త్రీలను జాగృతం చేసే సాహిత్యాన్ని, సృష్టించలేదు. సమాజంలో స్త్రీని యథాతథంగా తన రచనలలో చూపెట్టిన గురజాడ కృషి అతనితోనే ఆగిపోయింది.

అటు తర్వాత భావకవులంతా తమ ఊహల్లోని స్త్రీకి మాత్రమే తమ కవిత్వంలో రూపకల్పన చేసారు. ఆమెకు అయితే "ప్రేయసి" గాను, లేకపోతే "దేవత" గాను స్థానాన్ని కేటాయించారు గాని, ఒడి దుడుకులను ఎదుర్కొంటూ కుటుంబ జీవనాన్ని నడిపే సాధారణ స్త్రీగా ఆమెను గుర్తించనే లేదు. ఆమె బాధలనీ, సమస్యలనీ చిత్రించనూ లేదు.

ఫ్యూడల్ వ్యవస్థని దాటి రానున్న బూర్జువా సమాజానికి, అందులోని భావాలకీ దారి చూపుతూ వ్రాయబడిన భావకవిత్వం స్త్రీ యొక్క స్థానాన్ని కూడా ఆ దృక్పథం తోనే చిత్రించింది.

భావకవుల తర్వాత వచ్చిన అభ్యుదయకవులు దిగంబరకవులు సమాజంలోని వివిధ కోణాలపట్ల తమ దృష్టిని సారించారు గానీ ప్రత్యేకంగా స్త్రీ పరిస్థితి మీద ఎటువంటి వ్యాఖ్యానమూ చేయలేదు. ఈనాడు వస్తున్న విప్లవ కవిత్వంలో కూడా కొన్ని పాటలలో ఇంకా స్త్రీని గొప్పగా పోల్చవలసివస్తే పతివ్రతలనే ఉదాహరణగా తీసుకోవటం జరుగుతోంది.

అమాస్య చీకటి అర్ధరాతిరి చెల్లెమ్మా ! ఓ చెల్లెమా ![1] అనే పాటలో - మోహన్,

"సావిత్రమ్మలు, అనసూయమ్మలు చెల్లెమ్మా! ఓ చెల్లెమ్మా"
జన్మించిన ఈ గడ్డ మీదనే ,, ,,
మానమమ్మకొని బ్రతకవలెసెనా ,, ,, అని వ్రాస్తారు.

పై పాటలో దోపిడీ చేయబడుతున్న స్త్రీని సావిత్రి, అనసూయ వంటి పతివ్రతలతో గొప్పగా పోల్చి చెప్పటం అవగాహనా లోపం. పాతివ్రత్యం అన్నది దోపిడీ సంస్కృతిలోని భాగమే అన్న విషయాన్ని ఒక విప్లవ కవి "మరిచిపోతే" ఎలా ?

---

1. అమాస చీకటి - మోహన్ - అరుణకిరణాలు - పేజీ : 78.

ఇంకా ఎక్కడో గద్దర్, శివసాగర్ వంటి విప్లవ కవుల పాటలు తప్పించి, స్త్రీని జాగృతం చేయగల కవిత్వం రావటం లేదు. ఆధునిక వచన కవిత్వంలో కొన్ని కవితా ఖండికలు స్త్రీ సమస్యల మీద వచ్చినవి ఉన్నాయి. కానీ అవి సంఖ్యలో చాలా తక్కువ.

స్త్రీ పరిస్థితి ఈనాటికీ అట్టడుగునే ఉంది. ఈనాటికీ కన్యాశుల్కం పోయినా వరకట్నం ఆమెను బాధిస్తూనే ఉంది. ఆమెను ప్రబంధ కవిత్వంలో కన్నా హీనంగా సినిమాలలో ప్రదర్శిస్తున్నారు. ఇప్పటికీ స్త్రీకి ఆత్మవిశ్వాసాన్ని కల్గించి, మార్గ నిర్దేశం చేయగల రచనలు ఎక్కువగా రావటం లేదు. ఆమెని ఇంకా అబలగాను, పతివ్రతగానూ చిత్రీకరిస్తూ సాహిత్యము, సినిమాలు వస్తూ ఉన్నాయి.

సాంప్రదాయిక పరిధిలోనుంచి చూసేది కాక, సామాజిక దృక్పథంతో స్త్రీ సమస్యని విశ్లేషించగలగాలి. ఆ కారణాలను, దానికి పరిష్కారాలను ఆమెకు కవిత్వంద్వారాను, ఇతర సాహిత్యంద్వారాను అందివ్వగలగాలి. స్త్రీని ఇంకా కుటుంబ పరిధి నుంచి మాత్రమే చూసే దృష్టిని కవులు, రచయితలు మార్చు కోవాలి.

ఆమెకు సమాజంలోని అన్ని రంగాలలోను సమాన అవకాశాలు,స్వాతం త్ర్యము ఇవ్వాలి. ఇవన్నీ కూడిననాడు గాని ఈమె స్థానం మారదు, అది సమాజంలోనైనా, సాహిత్యంలోనైనా. అందుకే స్త్రీ సాంఘికంగా పురోగమించ టానికి వీలైన కవిత్వం ఈనాటి స్త్రీకి కావాలి. అప్పుడు మాత్రమే కవిత్వంలో స్త్రీకి తనదైన స్థానం లభిస్తుంది.

# ఉపయుక్త గ్రంథసూచి


తెలుగు పుస్తకాలు :

1. అప్పారావు, గురజాడ - 'ముత్యాల సరాలు'
ఎమ్. శేషాచలం అండ్‌కో, సికింద్రాబాదు, 1972.

2. అప్పారావు, బసవరాజు - "బసవరాజు అప్పారావు గేయాలు"
ఉదయభాస్కర్ పబ్లిషర్స్, విజయవాడ.

3. అష్టదిగ్గజములు - అష్టదిగ్గజ వర్ధంత్యుత్సవ సమితి, 1960.

4. ఆంధ్ర మహాభారతము - సంశోధిత పరిచరణము, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1972. (ఆది, సభా, అరణ్య, విరాట, ఉద్యోగ, అనుశాసనిక మహాప్రస్థానిక, స్త్రీపర్వాలు)

5. ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు - సం॥ డా॥ కె.కె. రంగనాథాచార్యులు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాద్, 1982.

6. ఆరుద్ర - సమగ్రాంధ్ర సాహిత్యం, 10, 11 సంపుటములు.
ఎమ్. శేషాచలం అండ్‌కో, సికింద్రాబాదు.

7. ఉమాకాన్త శేఖరులు - "నేటి కాలపు కవిత్వం"
వావిళ్ళ రామశాస్త్రులు అండ్ సన్స్ 1928.

8. కృష్ణ శాస్త్రి, దేవులపల్లి - కృష్ణ పక్షము, ప్రవాసము, ఊర్వశి. (రౌతు బుక్ డిపో, రాజమండ్రి).
పల్లకి, వ్యాసావళి-4 సంపుటాలు 1982. (రాజహంస ప్రచురణలు, మద్రాసు).

9. కృష్ణకుమారి, నాయని - పరిశీలన - వ్యాస సంకలనం, 1977.

10. కావ్యమాల - కేంద్ర సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ, సం॥ కాటూరి వెంకటేశ్వరరావు.

11. గోపాలరావు కాళ్ళకూరి - స్వానఘట్టము, సౌందర్య మంజరి 1936. విశల్యా డిపో, మద్రాసు.

12. పింగళి కాటూరి కవులు - సౌందరనందము, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1972.

13. పురుషోత్తమశర్మ, మంగిపూడి - కోయిల పాటలు, 1924; కేసరీ ముద్రాక్షరశాల, రాజమండ్రి.

14. పెద్దన, అల్లసాని - "మనుచరిత్రము" - ఎమ్. శేషాచలం అండ్ కో. 1970.

15 పోతన, బమ్మెర - ఆంధ్ర మహాభాగవతము; రవీంద్ర పబ్లిషర్స్, 1962; హైదరాబాదు.

16 బాపిరాజు, అడవి - 'శశి కళ'; 1954. శశికళ ప్రచురణలు, రామచంద్రపురం.

17. భూమయ్య, అనుమాండ్ల - నాయని సుబ్బారావు కృతులు-పరిశీలన

18. మహోదయము - సం॥ తల్లావజ్ఝల: ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్ కాకినాడ.

19. ముద్దుపళని - రాధికాసాంత్వనము; ఎమ్. శేషాచలం అండ్ కో 1972.

20. డా॥ నాగయ్య, జి - దక్షిణాత్య సాహిత్య సమీక్ష

21. డా॥ నారాయణరెడ్డి, సి. - ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయాలు, ప్రయోగములు

22. నారాయణరావు, వెల్చేరు - తెలుగులో కవితా విప్లవాల స్వరూపం; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1987.

23. రంగాజమ్మ - మన్నారుదాసు విలాసము, ఉషా పరిణయము తంజావూరు సరస్వతీ మహలు ప్రచురణ, 1955.

24. రమణారెడ్డి, కె. వి. - మహోదయం; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ

25. రామకృష్ణారావు, ఆబ్బూరి - 'ఊహాగానము'; కవిత, 15, సాధువా స్వామి మార్గ్, న్యూఢిల్లీ.
'నదీ సుందరి'; ఆంధ్ర సారస్వత పరిషత్తు

26. రామకృష్ణ కవి, తెనాలి - పాండురంగ మాహాత్మ్యం;ఎమ్. శేషాచలం అండ్ కో. 1970.

27. రామమోహన్, కడియాల - తెలుగు కవితా వికాసం; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ; హైదరాబాదు. 1982.

28. రామరాజ భూషణుడు - వసుచరిత్రము; ఎమ్. శేషాచలం అ. కో. 1970.

29. రామయ్యా పంతులు, జయంతి- ఆధునికాంధ్ర వాఙ్మయ వికాస వైఖరి, విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షర శాల, 1937.

30. రామలింగస్వామి, అనంతపంతుల - శుక్లపక్షము, చిత్రపు నాగరాజు; రాజ మహేంద్రవరం, 1932.

31. రామిరెడ్డి, దువ్వూరి - నలజారమ్మ, అగ్నిప్రవేశం, జలజమాలిక కడపటివాడుకోలు, యువకస్వప్నం (కవికోకిల గ్రంథావళి. నెల్లూరు జిల్లా)

32. నిర్మలాదేవి, ఎన్. - కృష్ణశాస్త్రి కృతుల పరిశీలన; పరిశోధనా వ్యాసం.

33. తిమ్మన, నంది - పారిజాతాపహరణము, ఎమ్ శేషాచలం అండ్ కో. 1970

34. తిమ్మయ, సారంగ - వైజయంతీ విలాసము, ఎమ్. శేషాచలం అండ్ కో.

35. తెలుగు సాహిత్యవికాసం - ఆంధ్ర సారస్వత పరిషత్తు: హైదరాబాదు సం॥ కె కె. రంగనాథా చార్యులు. 1979.

36. లక్ష్మీకాంతశాస్త్రి, శిష్టా - తంజాపూరు తెలుగు కవులు అరుణాబుక్ హౌస్, మద్రాసు, 1981.

37. వరలక్ష్మి, జె. - యుగయుగాల్లో భారతీయ మహిళ ప్రియ దర్శిని ప్రచురణలు. హైదరాబాదు, 1977.
38. విశ్వేశ్వరరావు, మల్లవరపు- మధుకీల, కల్యాణకింకిణి నవ్యసాహిత్య పరిషత్, ౧౯౩౮.
39. వెంకటరావు, కవికొండల - కవికొండల వెంకటరావు గీతాలు కాళహస్తి తమ్మారావ్ అండ్ సన్స్, రాజమండ్రి.
40. వెంకట పార్వతీశ కవుల - ఏకాంత సేవ, కావ్యకుసుమావళి ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్, కాకినాడ, 1938.
41. వెంకటేశ్వరరావు, కాటూరి - పన్నీటి జల్లు
42. వేంకటరాయశాస్త్రి, వేదం - ఆముక్తమాల్యదా సంజీవని, శృంగార నైషధ సర్వంకష (వేదం వెంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్, మద్రాసు) 1961.
43. వేంకటకృష్ణప్పనాయకుడు, సముఖం - అహల్యాసంక్రందనం, ఎమ్. శేషాచలం అండ్ కో.
44. వైతాళికులు - సం॥ ముద్దుకృష్ణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1978.
45. శివశంకర శాస్త్రి. తల్లావజ్ఝల - హృదయేశ్వరి, సాహిత్యసమితి, రేపల్లె.
46. సత్యనారాయణ, విశ్వనాథ- కిన్నెరసాని పాటలు. కోకిలమ్మ పెండ్లి గిరికుమారుని ప్రేమగీతాలు, వరలక్ష్మి త్రిశతి (వి.ఎస్ ఎన్. అండ్ కో, విజయవాడ)
47. సత్యనారాయణ, వేదుల - 'దీపావళి' ఎమ్ శేషాచలం అండ్ కో. 1974.
48 సాహిత్యోపన్యాసాలు - ఆం.ప్ర॥ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు.
49. సీతారామయ్య, కురుగంటి- నవ్యాంధ్ర సాహిత్యవీధులు హైదరాబాదు తెలుగు అకాడెమీ ప్రచురణ.
50. సుబ్బారావు, నండూరి - ఎంకి పాటలు ఉదయభాస్కర్ పబ్లిషర్స్, విజయవాడ.
51. సుబ్బారావు, నాయని - సౌభద్రుని ప్రణయయాత్ర, ఫలశ్రుతి ఆంధ్ర గ్రంధాలయ ముద్రాక్షరశాల. బెజవాడ మాతృగీతాలు ఆంధ్రసారస్వత పరిషత్తు

52. సుబ్బారావు, రాయప్రోలు - లలిత, తృణకంకణం, కష్టకమల, స్నేహలత, స్వప్నకుమారము (అభినవ కావ్యమాల, ప్రథమ హారము) లలితాకుటీరం, సికింద్రాబాదు, 1913, రూపనవనీతము - 1953.

53. సుప్రసన్న - సహృదయ చక్రము, సాహిత్య వ్యాస సంపుటి, శ్రీవాణీ ప్రచురణలు,వరంగల్.

54. సూరన, పింగళి - కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము ఎమ్. శేషాచలం అండ్ కో. 1971.


## ENGLISH BOOKS


1. A Literary History of English - Volume IV. Edited by Albert C. Bavgh.
2. A Short History of English Literature Emile Legovis: Translated by V. F. Boyson and J. Coulson. 1971.
3. English Literature and its Backgrounds, Vol - II. Bernard D. Grebarier and Others, Dryden Press, New York, 1951.
4. Opium and Romantic Imagination - Aletha Hayter, Faber & Faber, London 1971
5. Lyrical Ballads, 1798 - Oxford University Press 1927.
6 Types of English Poetry - Edited by Rudolf Kirk & Clara Marbura Kirk, Rutgers University
7. Romantic Imagination - C M Bowra Oxford University Press, London 1978.
8 The Study of English Literature by Cowardin and More; Henry Holt & Company New york © 1939.
9. Encyclopaedia Britanica Volume - 19; 1973 Ed.
10. Complete Poetical works of P B. Shelley and John Keats Poems - 1817.


